పెరియార్ వి. రామస్వామి



# రామాయణం

## (యదార్థ పరిశీలన)

# తొలి పలుకు

రామాయణానికి ఏ చరిత్ర ఆధారంలేదు. అదొక కల్పిత రచన. దాని ప్రకారం రాముడు తమిళుడు కాడు. తమిళ దేశానికి సంబంధించినవాడూ కాదు. అతను ఉత్తర భారతం వాడు. అతను చంపిన రావణుడు లంకకు రాజు, లంక అంటే దక్షిణ తమిళనాడు.

కించిత్తు అయినా తమిళ సంస్కృతి ("తిరుక్కురల్" సంస్కృతి) రాముడిలో లేదు. అతనికి లాగానే అతని భార్యకూడా తమిళ గుణగణాలు లేని ఉత్తర భారత మనిషి.

తమిళనాడుకు చెందిన ఆడ, మగవాళ్లను కోతుల్లాగ, రాక్షసుల్లాగ అసహ్యంగా చిత్రీకరించారు.

రామాయణ యుద్ధంలో ఉత్తరభారతానికి సంబంధించిన వాడెవడూ బ్రాహ్మడు లేక ఏ ఆర్యుడు (దేవుడు) ప్రాణాన్ని పోగొట్టుకోలేదు.

ఒక ఆర్యుడి కుర్రాడు జబ్బు వచ్చి చచ్చాడని వాడి కోసం ఒక శూద్రుడు తన ప్రాణాన్ని పణంగా చెల్లించాడు. యుద్ధంలో ప్రాణాలుపోగొట్టుకున్న వాళ్లందరూ తమిళులు మాత్రమే. వాళ్లనే రాక్షసులన్నారు.

రావణుడు రాముడి భార్య సీతను ఎత్తుకెళ్లాడు, ఎందుకంటే రాముడు అతని చెల్లెలి అవయవాల్ని కోసి కురూపిని చేశాడు. రావణుడు చేసిన ఈ పనికి లంకనెందుకు తగల బెట్టాలి? లంక వాసుల్ని ఎందుకు చంపాలి? ఈ కథ యొక్క ఉద్దేశ్యం తమిళుల్ని నీచంగా చూపించటం. తమిళనాడులో ఇంకా ఈ కథను గౌరవించటం అంటే ఆ ప్రజల స్వాభిమానాన్ని దెబ్బతీయటం, కించపరచటమూ అవుతుంది.

రాముడులోగాని సీతలోగాని దేవాంశమైనది కూడా ఏమీ లేదు.

స్వతంత్రంలాంటిది వచ్చిందని అనుకుంటున్న తరువాత తెల్లవాళ్ల విగ్రహాల్ని తీసేశారు. వాళ్ల పేర్లున్న స్థలాల్ని మార్చి వాటికి బదులు భారతీయుల పేర్లు పెట్టారు. అట్లాగే తమిళుల గౌరవాన్ని కించపరచే ఆర్యదేవుళ్లను వాటి ప్రాముఖ్యతను తీసి అవతల పారేయాలి. నరనరాల్లో ద్రావిడ రక్తం పారుతున్న ప్రతి తమిళుడు ఈ పనిచేయించటం తన కర్తవ్యంగా భావించి ప్రతిగ్న చేయాల్సి ఉంది.

# రామాయణం

## 1. పరిశీలన

రామాయణం, భారతం ఆర్యులు కల్పించిన శృంగార గాధలలో ప్రధానమైనవి. ద్రావిడుల స్వాభిమాన ఆలోచనను తుడిచి వేయటానికి, వారి వివేచనా పరిజ్ఞానాన్ని మొద్దుపరచటానికి, మానవత్వాన్నే నాశనం చేయటానికి ఆర్యులు పన్నిన ఉచ్చుల్లోకి ద్రావిడుల్ని లాగటానికి వేసిన వ్యూహం.

ఈ కథలలో ఉన్న రాముడు, కృష్ణుడు అనే నాయకులు ఆర్య కూటానికి చెందినవాళ్ళు. వాళ్లూ అందరి మనుష్యుల్లాగానే చాలా మామూలు మనుషులే.

ఈ కథలు ఈ నాయకుల్ని, వాళ్ళ బంధువుల్ని, వాళ్ళకు సహాయ పడిన వాళ్ళను, దేవుళ్లుగాను, అసాధారణ మానవ శ్రేష్టులుగాను, తప్పక గౌరవించాలని, ప్రజలు వారిని పవిత్రంగా పూజించాలని, వారు పూజించటానికి అర్హులని నిర్దేశించారు.

కాస్త జాగ్రత్తగా మూల గ్రంధాల్ని పరిశీలన చేస్తే, వాటిలో ఉన్న సంఘటనలు, సందర్భాలు అనాగరికంగా రూపొందించినట్లు ఉన్నాయి. ఇంకా చూస్తే అసలు ప్రజలకు ఉపయోగపడేదేమి లేదని తేలుతుంది. ముఖ్యంగా మనం నేర్చుకోవాల్సింది గాని, నడుచుకోవాల్సింది గాని ఏదీ లేదు. దీంట్లో నీతులు లేవు. ప్రశంసించాల్సిన ఏ తత్త్వ విచారము లేదు. ఈ అభూత కల్పిత కథలు రాసింది బ్రాహ్మల్ని ఇతరులకన్నా గొప్ప వారిగా చూడటానికి, ఆడవాళ్ళు తక్కువగా ఉండాలని, తక్కువగా ఉంచటానికి వాళ్ళ (బ్రాహ్మల) మనుధర్మ చాదస్తాల్ని, మనువు నిర్దేశించినవి, ఇతరులను కించపరచే వాటిని వారి మీదే బలవంతంగా రుద్దటానికి, ఆచరింపజేయటానికి, బ్రాహ్మలు బతకటానికి - వాళ్ళు బతకటమే ఒక అనవసరం - ఈ కథల్ని శాశ్వితం చేయాలని ఉద్దేశించినట్లు తేలుతుంది.

ఈ కథల మూల రచన మొదట సంస్కృతంలో రాశారు. ఆర్యులు వీటిని వివరించి చెప్పే భాష్యాలు ఊహాత్మకమైనవి. వారి పరిస్థితులకు అనుగుణంగా తతంగాలు, పూజలు చేసి ఒక చోట చెప్పిన దానికి మరొక చోట చెప్పినదానికి పొంతనలేని వివరాలు. ఈ కథల్ని వాళ్ళు వేదాలన్నారు. ప్రపంచాన్ని సరిదిద్దటానికి స్వర్గాన్నుండి దిగివచ్చిన అద్భుత రక్షకులుగాను చిత్రీకరించారు. జనం ఎలా నడుచుకొని జీవించవలసి ఉంటుందో ఆ శాస్త్రాలు బోధిస్తాయి. ఈ కథల వేద సారాలని అయిదో వేదం అనో, ఎంతెంతో గొప్పదనో వాక్రుచ్చుతారు. అటువంటి పచ్చి అబద్ధాలతో వాటి ప్రత్యేక విశిష్టతను చాటటానికి ఎన్నో చెపుతుంటారు. నిజానికి అటువంటివేమీ వాటిలో లేవు. అంతటితో ఆగక, వీటిని మతంలోకి చొప్పిస్తారు, మతానికి మూలస్తంభాలుగా నిలుస్తున్నాయంటారు. మామూలు ప్రజల్నే కాదు, చదువులు చదివారనుకుంటున్న వారిని కూడా మోసపుచ్చారు. ఈ కథల్ని ఎంతో విలువైనవని పవిత్రమైనవని స్కూళ్లో చదువుకునేప్పటి నుండి ప్రజల రక్తంలోకి చొప్పించి చాలా విస్తృతంగా ప్రచారం చేశారు.

నూటికి తొంభై మంది తమిళులు చదువు రానివారు. మిగిలిన పది మంది చదువుకున్నారని

చెప్పుకుంటున్నా వాళ్ళలో చాలా మంది మూఢనమ్మకాలతో వివేచనాశక్తిని కొద్దిగానైనా ఉపయోగించలేనటువంటి వారు. వీళ్ళు పరలోకాలున్నాయని నమ్మతారు. ఆర్యులు వక్కాణించే ఆ నమ్మకానికి దాసులై ఆర్యులు శాసించే వాటిని ఒప్పుకొని వాటి ప్రకారం నడుచుకుంటుంటారు. క్లుప్తంగా చెప్పాలంటే ముస్లింలు, క్రైస్తవులు తప్ప తమిళులందరూ రామాయణాన్ని అనుసరించే వారే.

తమిళ దేశీయుడికి తేటతెల్లమైన వివేచనా ద్రుక్పథం కలగాలి ఈ మూర్ఖత్వం, మూఢనమ్మకాలు తుడిచి పెట్టుకుపోవాలి, అతను స్వాభిమాన ఆలోచనను పెంచుకోవాలి. ఆర్య కూటాలనుండి తాను బయటపడాలి. ఈ దురుద్దేశాలను, ఈ కల్పిత గాథల పురాణాలను నిర్మూలించాలనే గట్టి అభిమానం అతనిలో పెరగాలి.

ఇటువంటి సరైన నిర్ణయాత్మకమైన దృష్టితో ఈ పుస్తకాన్ని చదవటానికి ఎక్కువ కాలం వెచ్చింకుండా ఉండటానికి వీలుగా రామాయణ అధ్యాయాల్లోని ముఖ్య ఘట్టాలన్నింటినీ ఎంతో శ్రద్ధగా పరిశీలించి సంక్షిప్తం చేసి 'వాల్మీకి రామాయణ సంవాదం' అనే పేరుతో ప్రత్యక్ష వాద ప్రతిపాదనల పద్ధతిలో 140 పేజీల పుస్తకమొకటి ప్రచురించాం.

రామాయణంలో వివరించిన సంఘటనలు జరిగి ఉంటాయనే ధోరణికి మేము ప్రాధాన్యత ఇవ్వటం లేదు. అవి అసలు నిజంగా జరిగి ఉండటానికి వీలేలేనివి. అయినప్పుడు ఈ కథను ఇంతగా ఎందుకు శోధించాల్సి వచ్చింది? ఇదంతా ఎందుకంటే, ఆర్యులు ఉపదేశించే వాటిని, ప్రచారం చేసే వాటిని, మన జనం ప్రాధాన్యతనిస్తున్నారు. దీనిని ప్రజలముందు బహిరంగం పరిచాలని నా కోరిక.

మూల రామాయణంలో అభిలషించాల్సింది ఏమీలేదని, దైవపరమైనది కూడా ఏదీ లేదని, నేర్చుకోవలసిన నీతి,అంటూ ఏమీలేదని, అనుసరించాల్సింది అంతకన్నా లేదని, ఏ విమర్శకు నిలవదని కథలో ఉన్న ఆర్యులు పుట్టుకతోనే ఉన్నతులనుకునే తత్వాన్ని, వారిని అలా గౌరవించే ఇతరుల మనస్తత్వాలలో ఉన్న పటాటోపాన్ని, కల్లబొల్లి తనాన్ని చూపి కళ్ళు తెరిపించాలని నా కోరిక.

దేవుళ్ళు, రుషులు, ఇంద్రుడు ఇంకా పవిత్రులుగా చెప్పబడుతున్న మునులు, వాళ్ళ గుణగణాలను మహిమలను సామాన్య మానవ ప్రవృత్తులలో పరిశీలిఛాల్సి ఉంది.

ద్రావిడులకు సంబంధించిన పురాతన భూమిని ఆర్యులు ఆక్రమించి వారిని అమానుషంగా అగౌరవపరచేటట్లు అంతా పచ్చి బూటకమైన చిత్రవిచిత్రమైన ఒక చెత్తచరిత్రను రాశారు. అలా రాసినదాన్నే రామాయణం అన్నారు. దాంట్లో రాముడు ఆయన పరివారం, ఆర్యులుగాను, రావణున్ని రాక్షసుడిగాను హనుమంతుడు, సుగ్రీవుడు, వాలి మొదలైన వారిని కోతులుగాను వర్ణించారు. ఈనాడు ఎంతో ఉన్నత పండితులమనుకునే వారు వెలిబుచ్చుతున్న సారాంశమిది.

ఈ పుస్తకం యొక్క ఉద్దేశ్యం ఆర్యులను ఎంత ఉచ్చ స్థానంలో చూపించారో, అలాగే ఎంత నీచంగా ఇతర జాతులను హీనపరుస్తూ చూచారో, తమిళులకు అద్దం పట్టినట్లు చూపించటం, అలాగే ద్రావిడజాతుల ఆత్మగౌరవాన్ని ఉద్దేశ్యపూర్వకంగా, రామాయణంలో ఉన్న ఆర్య పాత్రలు, ఎంతనీచంగా తూలనాడారో. ద్రావిడులుగా పుట్టి స్వంత జాతికి విద్రోహులై, అవిధేయత గల కుట్రదారులైన జనాన్ని ఆళ్వారులుగాను, దేవుళ్ళుగాను, పూజ్యులుగాను ఎంత గొప్పగా కొనియాడారో ఎత్తిచూపటం. ఈ పుస్తకం యొక్క ముఖ్య

ఉద్దేశ్యం. తమిళులు, వారిలో ముఖ్యంగా చదువుకున్న తమిళులు. వారు రామాయణాన్ని గురించి మాట్లాడేటప్పుడు కంబ రామాయణమని వారి అర్ధం. తమిళ పండితులు వారి భుక్తి కోసం కంబ రామాయణంలోని పాండిత్యాన్ని వారి అధ్యయనాన్ని బహిరంగ ఉపన్యాసాల రూపంలో బోధిస్తుంటారు. విద్రోహుడైన కంబనన్, వాల్మీకి రామాయణంలో ఉన్న ఉద్దేశ్యాలను, నిజాన్ని తనకు వీలైనట్లు ఎంతో అద్భుతంగా కథను వక్రీకరించి మూల రామాయణంలో ఉన్న ఉద్దేశ్యాలను ఎలా మింగేశాడో జనం అవగాహనకు తీసుకురావలసి ఉన్నది. తమిళ పండితులు వాళ్ళ గౌరవ ప్రతిష్టలను ఫణంగా పెట్టి బాహాటంగా జనం ముందు కంబముని సాహిత్యాన్ని చాలా గొప్పదని, దివ్యమైనదని ప్రచారం చేయటం ఎంతో విచారకరమైన విషయం.

ఈ పుస్తకాన్ని చదువుతున్నప్పుడు పాటకులు నిష్పక్షపాతమైన మనస్సుతో పరిశీలించి ఏవైనా విషయాల్ని పూర్వం వినలేదనో, చాలా కొత్తగా ఉన్నాయనో, ఏవో కల్పనలతో రాశామనో అనుకుంటే వారిని దయచేసి సంస్కృత రామాయణాన్ని తమిళంలోకి అనువాదం చేసిన శ్రీ ఆనందాచార్య 1877 సంవత్సరంలో వ్రాసిన పుస్తకాన్ని, అలాగే అనువదించిన ఇతర అనువాదాల కర్తలైన పండిత నటేశ శాస్త్రియార్, శ్రీ సి.ఆర్.శ్రీనివాస అయ్యంగారు, నరసింహాచార్య, గోవిందరాజా, అనంగాచార్య మొదలైన బ్రాహ్మణ పండితుల పుస్తకాలను పరిశీలించమని మనవి చేస్తున్నాము. సంస్కృతంలో గొప్ప పండితుడైన బెంగాలీ విద్వాంసుని రామాయణ అనువాదాన్ని పరిశీలించమని కోరుతున్నాము. అలాగే విల్సన్ రాసిన సరియైన ఇంగ్లీషు అనువాదాన్ని ఇంకా నిజాయితీగా అనువాదం చేసిన ఇతరుల గ్రంథాలను పరిశీలించవలసిందిగా పేర్కొంటున్నాము.

## 2. కథ యొక్క సారాంశం

రామాయణంలోని సంఘటనలు, వాటి వివరాలు అరేబియన్ నైట్స్ కథలు, షేక్స్పియర్, మదన కామరాజు, పంచతంత్రం కథలు మొదలైన కల్పిత రచనలతో పోల్చవచ్చు. అవి మానవశక్తికి, ఊహకు మించి ఉంటాయి. అందుకని రామాయణం నిజంగా జరిగిన గాథ కాదని నిక్కచ్చిగా చెప్పవచ్చు. వాస్తవంగా జరగటానికి వీలులేని విషయాల్ని భగవంతుడి దివ్యశక్తుల వలననే జరుగుతాయని కొందరు జనానికి చెప్పి ఒప్పించే ప్రయత్నం చేయవచ్చు. కాని రామాయణంలో వివరించిన విషయాలు ఏ ఆధారానికి నిలవవని, ఎవ్వరికీ ఉపయోగపడవని అసలు ఆలోచనకు పనికిరావని, ఎవరికయినా అవగాహన అవుతుంది. అంతేగాక కొన్ని సంఘటనల్లో ఉన్నతంగా వ్యవహరించాల్సిన చోట, ఉండవలసిన ఆలోచనా పద్ధతి కాని, మంచి తనం కాని వర్తింపచేయటానికి ప్రయత్నించలేదు. అటువంటి సమయాల్లో తీసుకున్న నిర్ణయాలు ఒక సాధారణ మనిషి తీసుకునే నిర్ణయాలకన్నా అధ్వాన్నంగా ఉన్నాయి. రామాయణ గ్రంథకర్త అయిన వాల్మీకి ఆ కథా నాయకుడైన రాముడ్ని మానవ మాత్రుడు కాదని, మానవ రూపంలో ఉన్నాడే కాని దివి నుంచి భువికి దిగివచ్చిన భగవంతుడేనని ఎంతో గుణశీలుడని నొక్కి చెప్పటం జరిగింది. కాని రచయిత రాముణ్ణి అతను చేసే పనులు చెప్పే మాటలతో ఒక దుర్మార్గుడుగాను, పచ్చి అబద్ధాలకోరుగాను, ద్రోహిగాను టక్కరి వాడుగాను, కుట్రదారుడుగాను, ఏ దయా లేని రాతి గుండెకల వాడుగాను, అసూయాపరుడుగాను,

తాగుబోతుగాను, మాంస భక్షకుడుగాను, ఎదురుగా తలపడలేక దాగి మాటుకాచి అమాయకులపై అంబుల్ని వేసి చంపేవాడుగాను, దుర్మార్గులతో సక్యతచేసే ముఠాదారుడుగాను, పౌరుష హీనుడుగాను, ఒకటేమిటి అన్ని అవలక్షణాలతో వర్ణించాడు. రాముడిలోను అతని కథలోనూ ఏ దైవత్వం కనిపించలేదు. సామాన్య మానవుడి కుండే గుణాలకన్నా ఎంతో తక్కువగా అతని పద్ధతిలో అతని నడవడి కనిపిస్తుంది. అతన్నుండి తమిళులు నేర్చుకోవాల్సింది గాని అనుసరించాల్సింది గాని ఏ మాత్రం లేదు.

## 3. కథెలా మొదలైంది

ఈ కథ మత సంబంధమైనది కాదు, హేతుబద్ధమైనది అంతకాన్న కాదు. తాము యజ్ఞం పేరుతో చేస్తున్న జంతుబలుల్ని రాక్షసులు అడ్డుకొని ఆపేస్తున్నారని నాలుగు తలల బ్రహ్మకు దేవతలెల్లి మొరపెట్టుకుంటారు. బ్రహ్మ, ఆయన తండ్రియైన విష్ణు దగ్గరకెళ్ళి ఫిర్యాదు చేశాడు. అప్పుడు విష్ణు భూమి మీదకు దిగిరావాలని నిర్ణయించుకొని రాముడుగా జన్మఎత్తి రాక్షసుల రాజైన రావణున్ని చంపాడు. (బాలకాండం-15వ అధ్యాయం) ఇది ఈ కథకు మూలం.

విష్ణు భూమి మీదకు దిగివచ్చాక చాలా చాలా బాధలు పడ్డాడు. దానికి కారణం పవిత్రమైన ఆర్యుల పురాణాలేమి చెప్పాయంటే విష్ణు (తిరుమళ్) అంతకు పూర్వం ఎన్నో చేయరాని అక్రుత్యాల్ని చేసి మునుల్ని పీడించాడు. కాబట్టి ఆ దుష్కర్మలకు శిక్షగా బాధల్ని అనుభవించాలని మునులు రుషులు అతన్ని శపించారట. ఎందుకు శపించారు? ఆ భగవంతుడు (తిరుమళ్) బృహిమహర్షి భార్యను చంపి పాపం చేసుకున్నాడు. ఆ భగవంతుడే అరాచకంగా, మోసంతో జలంధరుడి భార్య శీలాన్ని చెరిచాడు. పతీవ్రత అయిన అతని భార్యను తిరుమళుడు పట్టపగలు, ఇంట్లో కాకుండా బయట బాహాటంగా సంభోగించాడు. బహుశా అందరికి కనువిందు చేయాలనేమో! ఇటువంటివెన్నో చెత్త కథలు పురాణాలనిండా కనిపిస్తాయి. వాటినలా వదిలేయండి. వివేకంతో ఆలోచించే ప్రతివారూ దేవతలెవరో, అసురులెవరో, రాక్షసులెవరో సరిగా పరిశీలించండి. అలాగే త్యాగమంటే ఏమిటో కూడా ఆలోచించండి. భగవంతుడైన విష్ణుమూర్తి విచ్చలవిడితనం దొంగతనం, కూనీ మొదలైన అందరూ ఈసడించుకునే పనులెందుకు చేశాడు. అటువంటి నీచమైన దుశ్చేష్టలు చేసే వారిని దేవుళ్ళుగా పూజించాలా? ఈ పనులన్నీ ఎక్కడ జరుగుతున్నాయి? చాలా నిగూఢమైన లోకాల్లోనా లేక ఈ వాస్తవ భూతలం మీదనా? ఆ దేవతలు ఎక్కడ నివసించారు? ఎటువంటి యజ్ఞాలు లేక జంతు బలులు జరపాలని ఈ భూప్రపంచం మీదకు దిగి వచ్చారు? ఏమీ చేయలేని జంతువుల్ని ఘోరంగా బాధపెట్టి చంపి, వాటిని తింటూ, మద్యం సేవిస్తూ మంత్రాలు చదవటమేనా! ఇవన్నీ చేస్తే దేవుడు సంతృప్తిపడి, అలా చేసిన దేవతలకు, పెద్దలకు సమాజంలో పెద్దహోదా ఇచ్చి, పారితోషికాలు కూడా ఇచ్చి ఆదరిస్తాడా? అలా మూగ జంతువుల్ని చంపే క్రూరత్వాన్ని ఆపడం అన్యాయమవుతుందా? ఏ మాత్రం దయలేని ఈ కటికోళ్లను దేవతలని, అటువంటి హింసను ఆపి ప్రజల అభిమానాన్ని పొందే వారిని రాక్షసులని ఆ భగవంతుడనటం సరయిందేనా? విజ్ఞులైన వాళ్ళు ఈ విషయాలన్నింటినీ క్షుణ్ణంగా పరిశీలించాలి.

ప్రజలు ప్రభుత్వం కూడా ఈనాడు జంతుబలుల్ని, తాగుబోతుతనాన్ని జరిమానా,

జైలుశిక్షలు విధించే నేరాలుగా గుర్తిస్తున్నారు. రావణుడి కాలంలో కూడా ఈ ఘోరాల్ని ఆపటానికి ప్రయత్నించడం న్యాయమైన మంచి పనేకదా? రావణుడు శివభక్తుడు. యోగ్యుడైన భక్తుడికుండాల్సిన లక్షణంగానే అతని రాజ్యంలోని చట్టప్రకారం మద్యపానాన్ని జంతువుల్ని వధించే క్రూరత్వాన్ని నిషేధించి అమలు పరచటం ఒక భక్తుడిగా తన బాధ్యతను నిర్వర్తించటం కాదా? అటువంటి అమానుష కర్మకాండతో కూడుకున్న యాగాన్ని అతని రాజ్యంలో జరగకుండా నిరోధించిన కారణంగా దేవుడక్కడ అవతారమెత్తి ఆ రాజును, అతని వంశాన్ని, అతని రాజ్యాన్ని, ఆ రాజ్యంలోని ప్రజల్ని నాశనం చేయటం సరైనదేనా? ఈ విషయాల్ని జాగ్రత్తగా పరిశీలిస్తే రామాయణం అంతా పనికిరాని అన్యాయాలతో నిండి ఉందని మనం తెలుసుకుంటాం.

## 4. బలి ఇవ్వటం

రామాయణం మొదటి అధ్యాయం, బాలకాండలో వివరించిన దాన్ని బట్టి అయోధ్యకు రాజైన దశరథుడు, తనకు పుత్ర సంతానం కలగాలని యాగం చేయటానికి పూనుకొంటాడు. ఆ యాగంలో గొర్రెల్ని, పశువుల్ని, గుర్రాల్ని, పక్షుల్ని, పాముల్ని మొదలైన ఎన్నో జంతువుల్ని గుడ్లనుండి పుట్టే అన్ని జంతు జాలాన్ని, జంతువుల్ని ఎకాఎకి ఈనేటువంటి కనిపించే అన్ని ప్రాణుల్ని యాగంలో బలివ్వటానికి తయారుచేసి పెట్టాడు. ఒకవ్యక్తి తండ్రి కావటానికి ఎన్నో ప్రాణాల్ని నరికివేయడం ఎంత ఘోరం! ఎన్నో అసంఖ్యాకమైన ప్రాణుల్ని వధిస్తే ఆ భగవంతుడు తృప్తిపడి అలా వధించిన వాడికి కొడుకును పుట్టిస్తాడనటం ఒప్పుకోదగిన విషయమేనా? ఈ దేవతలకు ఒక రాజున్నట్లు చెప్పారు. అతని పేరు దేవేంద్రుడు. అందరూ ఛీకొట్టే అతని క్రూరమైన బుద్ధిలేని చేష్టల్ని వాళ్ళ కథల్లో ఆర్యుల సంస్కృతిగా నాగరికతగా వివరించారు.

మరి యాగం మాటేమిటి? దశరథుడి భార్యలలో ఒకరైన కౌసల్య యాగ క్రతువుకు నిలబెట్టిన గుర్రం తలను ఒకే ఒక్క వేటుతో నరికి పారేసి, చచ్చిన గుర్రం శవాన్ని ఆలింగనం చేసుకొని ఒక రాత్రంగా గడపటం, (బాలకాండ, 14వ అధ్యాయం) అలా చేయటం చేత గర్భధారణ జరుగుతుందని మానవ ప్రకృతి ధర్మం ఒప్పుకోదు కాని, భగవంతుడి పద్ధతి అదే అనుకోవాలి. అంతటితో ఆ తతంగం ఆగలేదు. యాగ సూత్రాలను బట్టి యాగం అంటే ఏమిటో అర్థం చేసుకుంటే వాళ్ళు మనస్సు ఒక్కసారి ఛీదరింపుతో కుప్పకూలేట్లు చేస్తుంది. యాగాన్ని గూర్చి ఇచ్చిన అసహ్యమైన వివరణ "జ్ఞాన సూర్యం" అనే పుస్తకం ద్వారా తెలుసుకోగలం. ఆ పుస్తకాన్ని "కుడి అరసు" ప్రెస్సు వాళ్ళు ప్రచురించారు. యాగం జరిగే రోజు తెల్లవారు జామున దశరథుడు తన మొదటి భార్య కౌసల్యతో సహా మిగిలిన ఇద్దరు భార్యలు సుమిత్ర, కైకేయిలను ముగ్గురు పూజారులకు యజ్ఞం జరపటానికి పారితోషికంగా అప్పజెప్పాడు. ఈ ముగ్గురు పూజారులు వాళ్ళ మృగతృష్ణకు పూర్తి న్యాయం చేసేట్లు అనుభవించి రాజుకు తిరిగి ఆడవాళ్ళను అప్పగించారు. దశరథుడు ఇది అంతా తెలిసే తిరిగి వారిని స్వీకరించాడు. (బాలకాండ 14వ అధ్యాయం) దాని తర్వాత ఆ ఆడవాళ్ళు గర్భవతులయ్యారు. మన్మధనాథ దాతార్ రాసిన ఇంగ్లీషు అనువాదంలో ఆ పూజారుల పేర్లు కూడా రాశాడు. వారి పేర్లు హోత, అధ్వర్యు, యుక్త. వీరికి ఆడవాళ్ళను అనుభవించటానికి కుదవపెట్టారు. పిల్లలు పుట్టించటానికి జరిపే యాగం ఈ పద్ధతిలో ఎందుకు నడుపుతారు?

ఈ విషయం మీద సూక్ష్మంగా ఆలోచిస్తే మనకు తేటతెల్లంగా తెలిసేదేమిటంటే యాగం యొక్క విధానం, దాని వలన వచ్చే ఫలితాలేమిటో యాగశాస్త్రాలు, పురాణాలు చెప్పినట్లు పిల్లలు పుట్టడంలేదు. యాగపూజారులు వలనే రాజుగారి భార్యలు గర్భవతులయ్యారు. దీన్ని సమర్థించేట్లుగా దశరథుడి పరిస్థితిని గూర్చి కంబరామాయణం చెప్పింది. యాగం జరుపుతున్న సమయానికి దశరథుడి వయస్సు అరవైవేల సంవత్సరాలున్నాయని అతనికి అరవైవేల భార్యలున్నారని, వాల్మీకి రామాయణం అతనికి మూడు వందల యాభైమంది భార్యలున్నారని తెలుపుతోంది. దీన్ని బట్టి మనకు తేలేదేమిటయ్యా అంటే దశరథుడు ముసలి వాడయి బాగా బలహీనపడి కామాతురతతో ఒక పెద్ద మాంసం కుప్పగా మిగిలిపోయాడు. బలహీనపడి సరిగా నిలబడలేని ముసలివాడు పిల్లల్ని పుట్టించటానికి ఉండవలసిన శరీర పటుత్వం లేనప్పుడు ఆడవాళ్ల మధ్య కాలక్షేపం చేస్తూ సంతృప్తిపడటం అసాధారణ విషయమేమీ కాదు.

మరికాస్త మళ్లా పరిశీలిస్తే అతని ముగ్గురు భార్యలు చాలా కాలంగా సంతానం లేకుండా ఉండి, యాగం జరిగిన మరుసటి రోజున పట్టులేక తప్పటడుగులు వేసే నపుంసక ముసలివాడి ప్రయత్నంతో గర్భవతులయి ఉంటారా అని పునరాలోచించాల్సిన విషయం.

ఆ ముగ్గురి పురోహితుల వలన ముగ్గురు రాణులు ఒక్కొక్కరు ఒక్కొక్క పిల్లవాడు చొప్పున ప్రసవించారు. ఆ ఆడవాళ్ళను పురోహితులు వాళ్ళ తనివి తీరా, వాళ్ళ ఇష్టమొచ్చినట్లు, వాళ్ళ ఇష్టమైనంత సేపు సంపూర్తిగా అనుభవించి తిరిగి రాజుకు అప్పగించి వాళ్ళు చేసిన కష్టానికి వేతనాలు కూడా పొందారు. రాణులు గర్భవతులు కావటానికి దశరథుడే కారణమని ఎవరైనా చెప్పగలరా? రాముడు, లక్ష్మణుడు, భరతుడు, శత్రుఘ్నుడు పురోహితులకే పుట్టారని, దశరథుడికి పుట్టలేదనేది వాస్తవ విషయమైనా దాన్ని ఆర్యధర్మం ఖండించలేదు. వాళ్ళ శాస్త్రాలలో నిర్దేశించిన ధర్మం ప్రకారం ఒక 'బ్రాహ్మణ' స్త్రీకి పిల్లలు లేకపోతే ఇతరులతో కొన్ని షరతులతో పిల్లలు కనవచ్చని వివరించారు. ఈ ధర్మాన్ని బలపరుస్తున్నట్లు ఇంకొక ఆర్య కథ అయిన భారతంలో కూడా ఇటువంటి ఘట్టాన్నే చూస్తాం. అక్కడ యాగం అనే మిషకూడా లేకుండా చాలా మంది విధవరాళ్ళు వాళ్ళ మత గురువయిన వ్యాసుడితో అక్రమ సంబంధం పెట్టుకొని ధృతరాష్ట్రున్ని, పాండుని కనటం ఇటువంటి ఉత్పత్తిలో భాగంగానే జరిగింది. భారతంలో అలా కనటాలు చాలా ఉన్నాయి. సీత పుట్టుక ఉదంతాన్ని తీసుకోండి. సీత తల్లి ఆ సమయానికి ఎవరికి తెలియని ఒకతనితో సంబంధం పెట్టుకొని తల్లి అయింది. ఆమె సీతను కని అడవుల్లో పారేసింది. సీత తన వివాహం చాల కాలం వరకు జరగక పోవటానికి కారణం తన తల్లి దండ్రులెవరో తనకు తెలియకపోవడం వలననేనని తానే స్వయంగా చెప్పుకుంది. (ఆర్య) పురాణాలలో చాలా సందర్భాలలో ఆడవాళ్లు మగవాళ్ల వలన గర్భం దాల్చరు, ఏవో కొన్ని హీనమైన జంతువుల సంపర్కంతో గర్భవతులవుతారని చెప్పటం చాలా విచిత్రంగా కన్పిస్తుంది. ఈ వాస్తవాలను బట్టి పిల్లలు పుట్టటానికి యాగానికే సంబంధం లేదని, యాగం పేరిట జరిపే ఉత్సవంలో తాగటం, మాంసం తినటం, విచ్చలవిడిగా ఆనందించటంతోనే పిల్లలు పుడుతున్నారని తేలుతోంది.

ఇప్పుడు రామాయణంలోని పాత్రల్ని గూర్చి అవి ఎలా ఉన్నాయో పరిశీలిద్దాం.

## 5. దశరథుడు

యాగం తర్వాత దశరథుడు రాముడికి పట్టాభిషేకం జరిపిన తీరును తొంగిచూద్దాం.

పట్టాభిషేకంపై ఉన్న అధ్యాయాలు దశరథుడు, అతని కుమారులు, భార్యలు, మంత్రులు ఎంత బుద్ధిలేని నీతిలేని విధంగా వ్యవహరించారో వివరిస్తాయి.

1. దశరథుడు కైకేయిని పెళ్ళి చేసుకునేప్పుడు ఆమెకు పుట్టిన కొడుకును అయోధ్యకు రాజును చేస్తానని ప్రమాణం చేశాడు. ఇంకా కొన్ని కథలు ఈ సందర్భాన్ని, రాజ్యాన్ని అన్ని విధాల ఆమె పెళ్లినాడే ఆమెకు అప్పగించాడని, దశరథుడు ఆమె ప్రతినిధిగా మాత్రమే రాజ్యమేలాడని వివరించాయి.

2. సంస్కృత రామాయణంలో ఈ విషయం నిర్ధారణ అయిందని డాక్టరు సోమసుందర భారతియార్ ఎం.ఎ. బిఎల్, ఆయన రాసిన "కైకేయి శీలం దశరథుని వ్యసనాల లొంగుబాటు" అనే పుస్తకం బయటపెట్టింది.

3. కైకేయికి దశరథుడి చేసిన ఈ ప్రమాణం రాముడికి, రాముడి తల్లి కౌసల్యకు తెలియనిది కాదు. కైకేయి కొడుకు భరతుడు అతని మామగారింటికి వెళ్లాడు. ఆ అదను చూపి రాముడి పట్టాభిషేకానికి భరతుడు స్వచ్ఛందంగానే ఒప్పుకున్నట్లు ముసలిరాజు భావించాడు. (అయోధ్యకాండ 4వ అధ్యాయం) దశరథుడు భరతుణ్ణి అతని మామగారింట పది సంవత్సరాలుంచటంలో ఒక ఉద్దేశ్యం ఉంది. అతనికున్న రాజ్యమేలే హక్కును అతను కోల్పోయేటట్లు ఉద్దేశించిన దుర్మార్గ ప్రయత్నం. భరతుణ్ణి అయోధ్యకు రాకుండా పదేళ్లు పొడుగునా వాళ్ల తాతగారింట్లోనే ఉండిపొమ్మని చెప్పవలసిన అత్యవసరమేమీలేదు. వాల్మీకి ఏడు ఎనిమిది అధ్యాయాల్లో ఇదే విషయాన్ని మండోదరి చేత చెప్పిస్తాడు. "దశరథుడు రాముడికి రాజ్యం కట్టబెట్టాలనే ముందుగానే ఒక పన్నాగం పన్ని భరతుణ్ణి వాళ్ల మామగారింటికి పంపాడు. భరతుడు రాజధానిలోనే ఉంటే ప్రజల యొక్క సానుభూతిని పొందవచ్చు, అందుకని అతన్ని దేశబహిష్కరణ చేసి మామగారింట్లో ఉంచితే ప్రజలతో సంబంధాలు సరిగా లేకుండా చేస్తాయి. ఇది కూడా దశరథుడి అభీష్టమే".

4. దశరథుడు అగస్మాత్తుగా అంతకు ముందు రోజు ఎంతో తెలివిగా కుట్రతో ప్రకటన చేసి మరుసటి రోజు రాముడి పట్టాభిషేకానికి ఏర్పాట్లు చేశాడు. (అయోధ్యకాండ - మొదటి అధ్యాయం).

5. ఆస్థాన మంత్రులు, వశిష్టుడు మొదలైన రాచగురువులు, రాముడుతోసహా అందరికీ భరతుడే ఆ రాజ్యానికి వారసుడని తెలుసు. అయినప్పటికీ చెడు ఉద్దేశ్యంతోనే రాముడికి పట్టాభిషేకం చేయటానికి ఒప్పుకున్నారు.

6. రాముడి తల్లి కౌసల్య రాముడే గద్దెనెక్కాలని ఎప్పుడూ పూజలు చేసేది.

7. దశరథుడు పట్టాభిషేకానికి చేయవలసిన ఏర్పాట్లు చాలా త్వరపడుతూ చేశాడు. భరతుడు, శత్రుఘ్నుడు, కైకేయి, జానకి, కైకేయంరాజు మొదలైన వారికి ఈ విషయం ముందుగా తెలియజేయకుండానే, ఎటువంటి ఆహ్వానాలు పంపకుండానే ఈ ఏర్పాట్లు చేశాడు. (అయోధ్యకాంద 1వ అధ్యాయం)

8. దశరథుడు, రాముడితో ఏకాంతంగా మాట్లాడుతూ భరతుడు ఈ పట్టాభిషేకాన్ని ఆపవలసిన అవసరం ఒకవేళ వచ్చినా, అతనులేనప్పుడు, అతను రాకమునుపే పట్టాభిషేకం జరిగితే అతను వ్యతిరేకత చూపక జరిగినదాన్ని ఒప్పుకోవచ్చు. భరతుడు

అదివరకే పట్టాభిషేకం జరిగిపోయింది కదా అని ఒప్పుకుంటాడు (అయోధ్యకాండ 12వ అధ్యాయం)

9. దశరథుడు, కైకేయితో ఇలా చెప్పాడు. "ఇంత వరకు ఎంతో ఘనంగా చేసిన ఏర్పాట్లన్నిటినీ నీవు నాశనం చేశావు". రాముడు తన పెద్ద కొడుకు కాబట్టి రాజ్యాన్నేలే అర్హత అతనికే ఉందని ఒక్కమాట కూడ ఆమెతో చెప్పలేదు. ఆమెను సముదాయించి తనవైపు తిప్పుకోటానికి ఎన్నో విధాల ప్రయత్నించి దశరథుడు విఫలమయ్యాక, రాముణ్ణి తన దగ్గరకు పిలిపించుకొని అతని చెవిలో రహస్యంగా చెప్పాడు "నాయనా! రామా! నాకు మతిస్థిమితం లేనప్పుడు, నేను నేనుగా లేనప్పుడు, భరతుడే ఈ రాజ్యమేలటానికి ఒప్పుకున్నాను. అందుకని ఈ పట్టాభిషేకం నీకు వర్తించదు. నన్ను ఈ దేశం నుండి వెళ్లగొట్టి ఈ రాజ్యాన్ని నీవు ఏలవచ్చు".

10. తను చేయవలసిన ప్రయత్నాలన్ని విఫలమయ్యాక, రాముడితోపాటు సుమంత్రుణ్ణి కూడ వెళ్లమని ఆజ్ఞాపించాడు. రాచ బొక్కసంలో ఉన్న మొత్తం ధనాన్ని, మొత్తం ధాన్యాన్ని, ప్రజలందరిని, వ్యాపారస్తుల్ని, వేశ్యలతోసహా రాముడికిచ్చి అతన్ని అడవికి పంపాడు. (అయోధ్యకాండ 36వ అధ్యాయం)

11. దశరథుడు రాముడికి ఇలా అన్నీ ఇస్తుంటే కైకేయి అడ్డుచెబితే ఆమెకు సమాధానంగా "నీవు దేశాన్ని మాత్రమే కోరావుగాని, దేశంలో ఉన్న వాటన్నింటినీ కోరలేదు కదా" అని అన్నాడు, (అయోధ్యకాంద 36వ అధ్యాయం)

12. తరువాత ధనాగారంలో ఉన్న ఆభరణాలన్నిటినీ సీతకిచ్చాడు. (అయోధ్యకాండ 36వ అధ్యాయం)

13. దశరథుడు వికల మనస్కుడై రాముణ్ణి, సీతను అడవులకు పంపినందుకు కైకేయిని కుప్పలకొద్ది తిట్లు తిట్టాడు. రాముడితోపాటు తన ఇంకోకొడుకైన లక్ష్మణుడు అడవులకు పోతుంటే కొంచెం కూడ చలించలేదు. ఈ సందర్భంలో లక్ష్మణుని భార్య ఉదంతం కూడ ఎక్కడా కనిపించదు.

మద్రాసు సంస్కృత కాలేజీలో ప్రొఫెసరుగా పనిచేసిన కీర్తిశేషులైన శ్రీ సి.ఆర్.శ్రీనివాస అయ్యంగారు 1925లో వాల్మీకి రామాయణాన్ని సంస్కృతం నుండి తమిళంలోకి అనువాదం చేశారు. వారు ఆ పుస్తకంలో "అయోధ్యకాండపై గమనించదగిన విషయాలు" అనే శీర్షికలో దశరథుడు మనసును చంపుకున్న వాడంటూ అతనికి వ్యతిరేకంగా అతనిపై 20 అభియోగాలు లేవనెత్తాడు. కైకేయి, సుమిత్రల యొక్క చర్యలు కూడ వివరించాడు. ఆ అభియోగాలేమిటంటే -

1. దశరథుడు కైకేయికిచ్చిన రెండు వరాలను అనాలోచితంగా మరచిపోయాడు. ఆ వరాల ప్రకారం ఆమెకిష్టమైన వాటిని కోరుకోవచ్చు. వేటినైనా ఆజ్ఞాపించవచ్చు.
2. ఆమెను పెళ్ళిచేసుకునేప్పుడు ఆమెకు పుట్టిన కుమారుడికి రాజ్యాన్ని అప్పగించుతానని ఆమెకిచ్చిన వాగ్దానాన్ని అతడు మరచిపోయాడు.
3. చాలా కాలంగా అరవై వేల ఏళ్లు జీవించినప్పటికీ కైకేయిపై ఉన్న కామవ్యామోహానికి బానిసై తన ఇతర ఇద్దరు భార్యలయిన కౌసల్య, సుమిత్రలను వాళ్లను చూడవలసిన మర్యాదలతో చూడలేదు.

4. కైకేయి మెప్పు పొందటానికి అతను తెలివి తక్కువగా ప్ర...
రాజ్యాన్ని రాముడికి అప్పగించుతానని ప్రజలముందు అతను వెల్లడించటం వలన

5. కైకేయికి, ఆమె తండ్రికి తాను చేసిన ప్రమాణాల్ని భంగపరచినట్లయింది.

తాను కైకేయికిచ్చిన వరాలు పర్యవసానంగా రాముణ్ణి అడవులకు పంపించవలసి

6. వచ్చింది. అందుమూలంగా అతను మానసికంగా దెబ్బతిని తరువాతెప్పుడో రాముడికి
పట్టాభిషేకం జరిపిస్తానని మళ్లా ప్రకటించాడు.

దశరథుడు చేసిన ఈ అసంబద్ధమైన ప్రకటనల వలన తాను భరతుడికి రాజ్యం

7. కట్టబెడతానని చేసిన ప్రమాణాన్ని నిలబెట్టుకోటానికి వీలుకాకుండా చేసినై.

వంశాచారం ప్రకారం కుటుంబంలో పెద్ద కుమారుడు రాజ్యాధికారానికి అర్హుడవుతాడని

8. వశిష్టుడిచ్చిన సలహాను కైకేయి మీదున్న వ్యామోహంతో దశరథుడు తోసిపుచ్చాడు.

అతని తెలివి తక్కువ తనానికి తాను మూల్యం చెల్లించాల్సి వచ్చింది. కైకేయిని

9. నిందించి ఆమెకతను ఇచ్చిన వరాలను అమలు చేయవద్దని ప్రాధేయపడ్డాడు.

తానెవరో, తనకున్న హోదా ఎటువంటిదో కూడ అతను మరచిపోయి ఆమె పాదాల

10. మీదపడి ప్రాధేయపడ్డాడు.

దశరథుడు కైకేయికి చేసిన ప్రమాణాన్ని బట్టి రాముడికి రాజ్యం అప్పగించటానికి

11. వీలుకాదని తెలిసిన సుమిత్రుడు, వశిష్టుడు, దశరథుణ్ని నివారించాల్సింది. కాని
వారలా చేయలేదు.

రాముడికి పట్టాభిషేకం చేసే కార్యక్రమం నెరవేరదని వారికి తెలుసు. ఆఖరికది

12. నిలవకుండా తగలబడి పోతుందని భవిష్యత్తు పరిణామాలు తెలిసి కూడ వశిష్టుడు
రాముడి పట్టాభిషేకానికి శుభముహూర్తం నిర్ణయించాడు.

రాముడికి పట్టాభిషేకం జరపటానికి ఒప్పుకోమని కైకేయిని సిద్దార్థుడు, సుమంత్రుడు,

13. వశిష్టుడు ఎంతో బతిమిలాడారు. ఆమె చేస్తున్న వ్యతిరేక ప్రయత్నాన్ని
విరమించుకోవలసిందిగా నచ్చజెప్పటానికి వారు చాలా ప్రయత్నం చేశారు. కైకేయి
తాను ఆశిస్తున్నది చట్టబద్ధమైనదేనని, తన ప్రయత్నాన్ని వదులుకోటానికి ఇష్టపడటం
లేదని ఆమె చెప్పినప్పుడు వారామెను తిట్టారు.

దశరథుడు రాముడికి పట్టాభిషేకం చేయటానికి ప్రజలు, మునుల అంగీకారాన్ని

14. కోరాడు. అలా కోరి కూడ చివరకు తన ఇష్ట ప్రకారమే రాముణ్ణి అడవులకు పంపాడు.
ఇతరుల ఇష్టాలు, అంగీకారాలతో నిమిత్తం లేకుండ తన ఇష్టమొచ్చిననట్లు వ్యవహరించి
నిర్ణయించటం తానితరులతో చేసిన నిర్ణయాల్ని అగౌరవపరిచే విధంగా ఉంటుంది.

15. ఆ విధంగా అగౌరవం పాలయిన అతని ప్రజలు, రుషులు రాముడు అడవికి పోతుంటే
వెళ్లవద్దని అతన్నెవరూ నివారించలేదు.

16. రాముడెలాపుట్టాడో అన్న విషయం, కైకేయిని పెళ్ళి చేసుకునేప్పుడు ఆమె కొడుకే
రాజ్యానికి వారసుడవుతాడని చేసిన ప్రమాణమెటువంటిదో అన్నీ తెలుసుకోవాల్సిన
అవసరము అతనికుంది. (అయోధ్యకాండ 10వ అధ్యాయం). తెలిసినప్పటికి వాటిని
తన తండ్రి అమలుచేయమని చెప్పక తనకే పట్టాభిషేకం చేయాలని తన తండ్రి
ఉబలాట పడుతుంటే రాముడు నంగిగా మాట్లాడకుండా ఉండిపోయాడు.

17. దశరథుడు రాముడితో "మనం చేస్తున్న ప్రయత్నాల్ని ఆటంకపరచటానికి ఎన్నో

అవరోధాలు కలగవచ్చు''నని చెప్పాడు. అంతేకాక భరతుడు చాల మంచివాడని, ఉదార హృదయం కలవాడని, భగవంతుని భక్తుడుగా పెరిగాడని చెప్పాడు. "అతనిక్కడ చాలా కాలంగా లేకుండా ఉంటున్నాడు కాబట్టి దశరథుడు చేసే పనుల్ని పట్టించుకోని మంచి మనసున్నా, ఇతరుల ప్రోద్బలంతో మనసు మార్చుకోవచ్చు. అందుకని భరతుడు రాకమునుపే ఈ కార్యక్రమం పూర్తి చేయటం మంచిది'' అన్నాడు. (అయోధ్యకాండ 4వ అధ్యాయం) ఆ విధంగా భరతుడికున్న చట్టబద్ధమైన హక్కును దశరథుడు తోసిపుచ్చటానికి కుట్రపన్ని రాముడికి పట్టాభిషేకం చేయటానికి తలపడ్డాడు. రాముడు కూడా ఈ కుట్రకు తలవొగ్గి ఒప్పుకున్నాడు.

18. పట్టాభిషేకానికి జనకుణ్ణి కూడా ఆహ్వానించలేదు. ఒకవేళ భరతుడికే పట్టం గడితే జనకుడు ఆగ్రహించవచ్చు. రాముడికి రాజ్యాధికారం ఒరిగే హక్కు ఒకటుందని తెలిసి జనకుడు సంతోషపడవచ్చు. అయినా అతన్నీ పిలవలేదు.
19. చేసిన ప్రమాణాన్ని నిలబెట్టుకోకుండా భరతుణ్ణి విస్మరించి రాముడికి రాజ్యం కట్టబెడితే కైకేయం రాజు మండిపడతాడని అతన్ని కూడా ఆహ్వానించలేదు.
20. ఎన్నో తంటాలు, కలహాలు వస్తాయని ఇతర రాజుల్ని కూడా ఆహ్వానించలేదు. ఒక హక్కుగా, న్యాయపరంగా కైకేయి, మండోదరి చేస్తున్న ప్రయత్నాలు చాలా సహేతుక మైనవి. వాటిని ఏ మాత్రం పరిశీలించకుండా వాళ్ళను తిట్టటం గాని, వాళ్ల మీద అసహ్య మైన నిందలు వేయటం గాని అసమంజసం, అసంబద్ధం కూడా.

## 6 రాముడు

ఇక రాముణ్ణి అతని గుణగణాల్ని గూర్చి పరిశీలిద్దాం.

1. కైకేయి పెళ్లి జరిగేప్పుడు రాజ్యాన్ని ఆమె ఇష్టానికి వదిలేసినట్లు రాముడికీ తెలుసు. ఈ విషయాన్ని తానె భరతుడి కూడా చెప్పాడు. (అయోధ్య 107వ అధ్యాయం)
2. ప్రజలతోగాని, తండ్రితోగాని, కైకేయితోగాని అతను ఎంతో కలిసి మెలసి ప్రవర్తించటానికి వెనుక ఉన్న ఉద్దేశ్యం ఏదో విధంగా తాను రాజ్యాధికారం సాధించటానికేనని తెలుస్తోంది. (పచ్చగడ్డిలో దాగి కాటువేయటానికి పొంచి ఉన్న షాములాంటి ప్రవర్తన అతనిది)
3. భరతుడు లేని సమయంలో తనను రాజ్యాధిపతిని చేయటానికి తన తండ్రి చేస్తున్న ప్రయత్నాలు కుతంత్రాలేనని తనకు తెలిసి కూడా వాటిని కిమ్మనకుడా అనుసరించాడు.
4. తనకు కలిగే అదృష్టానికి లక్ష్మణుడు అసూయపడి తనకెక్కడ హాని చేస్తాడోనని భయపడి అతన్ని మెప్పించటానికి "లక్ష్మణా! నేను సింహాసనాన్ని కావాలని కోరుకుంటున్నది నీ కోసమే. నిజానికి దేశాన్ని పాలించేది నీవే'' అంటాడు. (అయోధ్యకాండ 4వ అధ్యాయం). రాముడు చివరకు దేశాన్నేలటానికొచ్చినప్పుడు రాజ్యపరిపాలనా విషయాల్లో లక్ష్మణుడికెలాంటి సంబంధం లేకుండా పోయింది.
5. తన పట్టాభిషేకానికై చేస్తున్న వేడుక పూర్తిగా జరుగుతుందో లేక అభాసు పాలవుతుందోనని రాముడు తనలో తాను అన్ని చోట్ల అపనమ్మకంతోనే ఉన్నాడు.
6. "ఈ రాజ్యం నీకు రాదు. నీవు అడవులకు వెళ్లక తప్పదు'' అని దశరథుడు చివరికి వెల్లడించినపుడు అతను రహస్యంగా ఏడ్చాడు. (అయోధ్యకాండ 12వ అధ్యాయం)
7. అతను ఏడుస్తూ తన తల్లితో ఇలా వాపోతాడు. "నేను రాజ్యమేలే మాట మరచిపోవాలి,

రాకుమారునికుండే సుఖవిలాసాల్ని మరచిపోవాలి, కమ్మని రుచికరమైన మాంసాహారపు భోజనాల్ని కూడ వదులుకోవాలి. చివరకు నన్ను అడవివెళ్లి కందమూలాలు తినమని ఆజ్ఞాపించారు'' (అయోధ్యకాండ 20వ అధ్యాయం)

8. విచార హృదయంతో అతని తల్లి, భార్య ఎదుట నిలిచి "నాకు దక్కుతుందనుకున్న రాజ్యం నా చేయిజారిపోయింది. అంతేకాకుండ నన్ను అడవులకు పొమ్మని ఆజ్ఞాపించారు' ' (అయోధ్యకాండ 20, 26, 94వ అధ్యాయాలు)

9. అతను లక్ష్మణుడి దగ్గర తన తండ్రి అయిన దశరథుణ్ణి ఒక హంతకుడిగా చిత్రీకరిస్తూ "తండ్రి చెప్పినట్లే అన్నివేళలా నడచుకునే కుమారుణ్ణి ఏ బుద్ధిలేని వాడు అడవులకు పంపుతాడూ?'' అని తిట్టాడు. (అయోధ్యకాండ 53వ అధ్యాయం)

10. రాముడు చాలామంది స్త్రీలను పెళ్ళిచేసుకున్నాడు. ఈ విషయం శ్రీ శ్రీనివాస అయ్యంగారు 1952లో ప్రచురించిన వాల్మీకి రామాయణం అనువాదంలో ఉంది. (రెండవ ప్రచురణ, అయోధ్యకాండ 8వ అధ్యాయం, 28వ పేజీ). అయ్యంగారు అంటారు. "రాముడు సీతను తన పట్టపు రాణిగా పెళ్లి చేసుకున్నాడు. ఆమెనే కాకుండా సంభోగానందం కోసం చాలా మంది ఇతర స్త్రీలను రాచ సంప్రదాయాల ప్రకారమే పెళ్లి చేసుకున్నాడు''. మన్మధనాధ దాతార్ "రాముడికున్న ఎంతో మంది భార్యలు తమ ఆడ సేవికబ్రుందాలతో సుఖవిలాసాలతో తులతూగుతూ కాలం గడుపుతుండే వారు. మరొకవైపు కైకేయి కోడలయిన భరతుడి భార్య దుఃఖంతో అల్లాడిపోతుండేది'' అని చెప్పారు. (1892లో వీరు ప్రచురించిన అనువాదంలోని అయోధ్యకాంద 8వ అధ్యాయం, 202 పేజి) "రాముడు భార్యలు'' అనే మాటను రామాయణంలో చాలా సందర్భాలలో వాడారు.

11. కైకేయి రాముడి పట్ల ఎంత మమకారం చూపినా అతను ఆమెపట్ల అన్ని సందర్భాల్లో అపనమ్మకంతోను, నటనతోను వ్యవహరించాడని ఏ అనుమానంలేకుండా చెప్పొచ్చు.

12. రాముడు కైకేయి దగ్గర మమత, ఆత్మీయత వున్నట్లు నటిస్తూ వచ్చాడు. చివరకు ఆమెను నిందిస్తూ "కైకేయి చాల దుర్మార్గురాలు'' అన్నాడు. (అయోధ్యకాండ, 31, 53 అధ్యాయాలు).

13. కైకేయికి చెడు ఆలోచనలేమీ లేకపోయినా రాముడు "కైకైయి నా తల్లిని సరిగా చూడక పోవచ్చు'' అని ఆమెపై నిందారోపణ చేశాడు. (అయోధ్యకాండ, 31, 53 అధ్యాయాలు).

14. "ఆమె నా తండ్రిని చంపవచ్చు'' అని నిర్మొహమాటంగా రాముడు కైకేయి ప్రవర్తన చెడ్డదని ఆపాదిస్తాడు.

15. అడవిలో రాముడు ఏ చిన్న కష్టాన్నెదుర్కోవలసి వచ్చినా తనకేదో అపాయం జరగబోతోందని భయపడుతూ "కైకేయి కోరిక ఫలించింది, ఆమె సంతృప్తి పడుతుంది' ' అని వాపోయాడు.

16. అడవిలో సంచరిస్తున్నప్పుడు అతను లక్ష్మణుడితో "మన తండ్రి ముసలివాడయ్యాడు, చేతకాని వాడయ్యాడు. మనం అడవులకు రావడం చేత భరతుడు అతని భార్యతో అయోధ్యను పాలిస్తూ నిరాటంకంగా జల్సాగా గడుపుతున్నాడు'' (అయోధ్యకాండ, 53వ అధ్యాయం) ఈ మాటలు అతని ఆంతర్యంలో వున్న నీచత్వాన్ని, అసూయను రాజ్యమేలాలనే పెద్ద ఆశను బయటపెడతాయి.

17. కైకేయి అతనితో "రామా! భరతుడు అయోధ్యనేలతాడని నీవు అడవులకు పోకతప్పదని దశరధుడు నీతో చెప్పమని కోరాడు'' అని అన్నప్పుడు రాముడు ఆమెకు సమాధానమిస్తూ "భరతుడికి రాజ్యాధికారం యిస్తున్నట్లు దశరథడు నాతో ఎప్పుడూ చెప్పలేదు'' అంటాడు. (అయోధ్యకాండ 19వ అధ్యాయం)
18. రాముడు తన తండ్రిని "బుద్ధిలేనివాడు, మూర్ఖుడు'' అని పిలిచాడు (అయోధ్యకాండ 53వ అధ్యాయం).
19. అతను తండ్రిని బతిమలాడుతూ "తాను అడవుల నుండి తిరిగి వచ్చేవరకు, రాజ్యాన్నెవరికీ అప్పగించవద్దు, అంతవరకు నీవే దేశాన్నిపాలించు'' అని అంటాడు. అలా భరతుడు సింహాసనం ఎక్కకుండా చక్రానికి అడ్డుపుల్ల వేయాలని చూస్తాడు. (అయోధ్యకాండ, 34వ అధ్యాయం).
20. "నాకు కోపం వస్తే నా శత్రువుల్ని మట్టుపెట్టి రాజును కాగలను. కాని అలా చేస్తే ప్రజలంతా నన్ను ఛీదరించుకుంటారని ఆగుతున్నాను''. ఆ విధంగా రాముడు న్యాయాన్ని, యదార్థ ధర్మాన్ని అగౌరవపరుస్తూ తన వ్యతిరేకతను చూయిస్తాడు.'' (అయోధ్యకాండ, 53వ అధ్యాయం)
21. అతని భార్య సీతతో చెప్తాడు "సీతా! భరతుడికనుగుణంగా, అతనికి అయిష్టం కలగకుండా వ్యవహరించు. అలా చేయడం చేత తరవాత మనకు చాల లాభం కలుగుతుంది.'' (అయోధ్యకాండ, 26వ అధ్యాయం.)
22. రాముడు రాజ్యమేలటానికి నిషేధమేర్పడిందని వినగానే భరతుడు రాముణ్ని వెనక్కి తీసుకొని రావటానికి అడవులకెళ్లాడు. భరతుణ్ని చూసి రాముడు "ఓ భరతా! ప్రజలు నిన్ను రాజ్యం నుండి తరిమివేశారా? నీకు యిష్టం లేకపోయినా తండ్రికి సహాయపడదామని ఇక్కడకు వచ్చావా?'' అని ప్రశ్నించాడు (అయోధ్యకాండ, 100 వ అధ్యాయం)
23. "ఇప్పుడు నీ తల్లి కోరికలు నెరవేరినై కాబట్టి ఆమె సంతోషంగా ఉందా?'' (అయోధ్యకాండ 100వ అధ్యాయం).
24. భరతుడు తనకున్న రాజ్యాధికారాన్ని వదులుకున్నట్లు రాముడికి అభయమిచ్చాడు. భరతుడు ఆ మాటన్న తరువాత రాముడు భరతుడికి అసలు రహస్యం చెప్పాడు. దశరధుడు ఎప్పుడో భరతుడి తల్లి కైకేయికి రాజ్యభారాన్ని అప్పగించేశాడని. (అయోధ్యకాండ, 107వ అధ్యాయం)
25. భరతుడు తన రాజ్యాన్ని రాముడికి అప్పగించి రాముడి కాలి చెప్పులు తీసుకొని అయోధ్యకు తిరిగి వచ్చాడు. ఆ చెప్పుల్ని సింహాసనం మీద ఉంచి పద్నాలుగేళ్ళు సన్యాసి జీవితం సాగించాడు. రాముడు గడువు అయ్యాక కూడ అడవినుండి తిరిగి రాకపోతే భరతుడు చాల బాధపడ్డాడు. ఆ బాధతో అగ్నిలో దూకటానికి కూడా ఏర్పాట్లు చేసుకున్నాడు. అటువంటి గొప్ప ప్రవర్తన, నిజాయితీ ఉన్న వాడిని రాముడు అనుమానించాడు. అయోధ్య పొలిమేరకు రాముడు చేరినప్పుడు భరతుడికి హనుమంతుడితో సందేశం పంపుతూ ''నేను విభీషణుడు, సుగ్రీవుడితో కూడా కలిసి చాల పెద్ద సైన్యంతో వచ్చాను. అలా చెపుతున్నప్పుడు భరతుడి ముఖ కవళికల్ని గమనించి, అతను వెంటనే తీసుకునే చర్యల్ని కూడా పరిశీలించు, ఎందుకంటే

అయోధ్యలో అతననుభవించే ఎనలేని సౌఖ్యాల్ని విడనాడటం చాలా కష్టం కనుక" అని హనుమంతుడితో అంటాడు. (ఉత్తరకాండం, 127వ అధ్యాయం)

26. రాముడు సీత శీలాన్ని అనుమానిస్తూ ఆమెను మంటల్లోదూకి వొళ్లు కాలకుండా బయటికి వచ్చి తన శీలం సరైందని నిరూపించుకోమన్నాడు. రాముడు నిర్దేశించిన పరీక్షను నిర్వర్తించినా, సీత కడుపుతోవుందని కనుక్కుంటాడు. సీత యొక్క పాతివ్రత్యాన్ని అనుమానించే విషయం అందరినోట ఒక చర్చనీయాంశమైంది. సీత శీలాన్ని ప్రజలు శంకించటాన్ని సీత దృష్టికి తీసుకొచ్చి అదే సమయంలో ఆమె కడుపుతోందని తాను గుర్తించటంవలనే ఆమెను అడవులకు పంపవలసి వచ్చిందని ఆమెకు తెలియపర్చకుండానే గర్భవతిగా వున్నప్పుడు అడవుల్లో వదిలేశాడు.

28. సీత శీలం పవిత్రమైందని వాల్మీకి నిక్కచ్చిగా చెప్పినా రాముడు నమ్మలేదు. అందుకని ఆమె భూమిలో ఏర్పడిన ఒక అగాధంలోకి దూకి చావవలసి వచ్చింది.

28. సుగ్రీవుడు, విభీషణుడు వాళ్ల అన్నల్ని చంపి రాజ్యాన్ని చేజిక్కించుకోవాలనే ద్రోహపూరితమైన ఆలోచనలతో తనను ఆశ్రయిస్తున్న నీచులని తెలిసికూడా వాళ్లతో స్నేహం చేశాడు.

29. వాలికి అవిధేయుడైన అతని తమ్ముడికోసం వాలి రాముడికి ఏ హానిచేయకపోయినా, వెనుకదాగి దొంగతనంగా వాలిని హతమార్చాడు రాముడు. వాలి ఎదుటపడి ముఖాముఖి అతనితో యుద్ధంచేసే ధైర్యం చేయలేనటువంటి రాముణ్ని ఒక గొప్ప వీరుడిగా అమాయకులు పొగుడుతారు. బ్రాహ్మలు ఇంకా గొప్పగా నొక్కి చెపుతూ అతని వీరత్వాన్ని ఎంతో మెచ్చుకుంటారు.

30. విభీషణుడి లొంగుబాటును ఒప్పుకుంటున్నప్పుడు రాముడు తనకు తెలియకుండానే తనలో ఉన్న దుష్ట మనస్తత్వాన్ని, ద్రోహాన్ని బయటకు వెల్లడిస్తాడు. భరతుడు ధర్మ ప్రవర్తనకు బద్ధుడని, తన పెద్దన్న పట్ల ఎంతో వినయం కలవాడని భరతుడికి మించినవాడు ఈ భూప్రపంచంలో ఎవ్వడూ లేడని ఈ విష స్వభావుడు (ఈ పెద్దన్న) భరతుణ్ని కొనియాడతాడు. భరతుడి ప్రవర్తన కల్గిన సోదరుడు (ఒకే అమ్మకు, అబ్బకు పుట్టిన సోదరుడు) మరొకడెవడైనా ఉన్నాడా అని ఆశ్చర్యపడతాడు (ఉత్తరకాండ, 17వ అధ్యాయం). ఆ విధంగా రాముడు తాను దుష్టుణ్నని ఒప్పుకుంటాడు.

31. వాలిని చంపిన తీరును సమర్థించుకుంటూ "ధర్మసూత్రాలు అడవి జంతువులకు వర్తించవని, అయినా వాలి సహేతుకంగా ప్రవర్తించలేదు కాబట్టి అతణ్ని చంపానని" రాముడు వివరిస్తాడు. వాలి మీద మోపిన అభియోగాలకు అతడి సంజాయిషీ ఏమిటో అడగటానికి ప్రయత్నించకుండానే స్వార్థపరుడైన సుగ్రీవుడు చెప్పిన మాటలు నమ్మి వాలిని చంపాడు.

32. రాముడు చాలమంది ఆడవాళ్లను, వాళ్ల ముక్కులు, చెవులు, చన్లు వగైరా కోసి అంద వికారులుగా చేసి హింసించాడు. (శూర్పణక, అయోముఖి)

33. రాముడు చాలామంది ఆడవాళ్లను చంపాడు (తాటకి)

34. రాముడు ఎన్నో సందర్భాల్లో ఆడవాళ్లతో అబద్ధాలాడాడు.

35. రాముడు ఆడవాళ్లను ఇలా తిట్టాడు – "ఆడవాళ్లను నమ్మకూడదు. భార్యకు

రహస్యాల్ని చెప్పకూడదు" (అయోధ్యకాండ, 100వ అధ్యాయం)

36. సంభోగానందం పొందాలని తీరని తీవ్రమైన కోరిక రాముడికెప్పుడూ ఉంటూనే ఉంది.

37. అనవసరంగా ఎన్నోజంతువుల్ని చంపి భోంచేశాడు.

38. రాక్షసుల్ని చంపటానికే రాముడు అడవికెళ్లానని, ఎవరికో ఇచ్చిన మాటకోసం కూడా అడవికెళ్లి రాక్షసుల్ని సంహరిస్తానని చెప్పాడు. (అరణ్యకాండ, 10వ అధ్యాయం)

39. రాక్షసుల్ని యుద్ధంలోకి లాగాలని, సీత ఎంత నివారిస్తున్నా వినకుండా రావణుడి రాజ్యం ఎల్లలు దాటి అతని దేశంలోకి ప్రవేశించాడు.

40. రావణుడితో పోరాడుతూ "రాక్షసుల్ని చంపమని ఒకే ఒక కర్తవ్యాన్ని ఆదేశిస్తూ నన్ను ఆడవులకు పంపారు" అంటాడు. (అర్యకాండ, 29వఅధ్యాయం)

41. ఒక స్వార్థపరమైన ఉద్దేశంతోనే "నన్నాదరించు", "నాపై దయ జూపు" అంటూ వచ్చిన ద్రోహి, పనికిమాలిన సుగ్రీవుడికి రాముడు తనకుతానే వశమయ్యాడు.

42. విభీషణుడు తన అన్న రావణుణ్ని ద్రోహం చేశాడని తెలిసి కూడా రాముడతణ్ని తన వైపు తీసుకున్నాడు. (ఉత్తరకాండ, 17వ అధ్యాయం)

43. విభీషణుడికి లంకాధిపత్యాన్ని దక్కిస్తానని ఆదివరకే అభయమిచ్చి (ఉత్తరకాండ, 18వ అధ్యాయం) రాముడు అంగదుడి ద్వారా రావణుడికి సందేశం పంపుతూ సీతను తిరిగి తన వద్దకు పంపిస్తే, అతని రాజ్యాన్ని అతనికిచ్చి వేస్తానని చెపుతాడు. "రావణుడితో చెప్పు. సీతను వదిలిపెడితే అతని రాజ్యం అతనికిస్తాను" అని. (ఉత్తరకాండ, 40వ అధ్యాయం) ఈ అభియోగానికి మించి మరే అభియోగానికి రావణుడు గురికాలేదని, రాముడు ఇచ్చిన మాటను నిలుపుకునే నమ్మదగిన మనిషికాదని ఈ మాటలు రుజువుచేశాయి.

44. భరతుడు, కైకేయి, రాజగురువు, ప్రజలు అందరూ అడవికెళ్ళి తిరిగి తమ దేశానికి రమ్మనమని బ్రతిమలాడుతారు. రాముడి ముందు "సత్యాగ్రహం" చేయటానికి తలపడతారు. కాని రాముడు మొండితనంతో "నేనెవరిమాటను లెక్కచేయను. నాతండ్రి మాటనే శిరసా వహిస్తాను" అని సమాధానమిస్తాడు. అలా తిరిగి రావటాన్ని తోసిపుచ్చుతాడు. ఈ రాముడే దశరథుడు భరతుడికి రాజ్యాధికామిస్తానని కైకేయికి చేసిన ప్రమాణాన్ని తోసిపుచ్చి తనకు పట్టాభిషేకం చేయాలని ఆశించినప్పుడు తండ్రి మాటను అంగీకరిస్తాడు. (యుద్ధకాండ, 130వ అధ్యాయం)

45. గద్దె నెక్కటానికి తన అంంగీకారాన్ని తెల్పటమే గాక, తండ్రి ఆగ్నప్రకారం అడవులకెళ్లి తిరిగి అయోధ్యకు వచ్చాక తనకు రాజ్యాభిషేకం చేయటానికి కూడా అంగీకరించాడు. రాజ్యాధీశుడు కావాలనే ఆశ, కోరిక, జాగ్రత్త తప్ప అతని ఆలోచనల్లో మరేది పొసగదు. రాముడు చాలా సార్లు చాల సందర్భాలలో ఈ విషయాన్ని వెల్లడిస్తాడు.

46. రాముడు తపస్సు చేస్తున్న శంభుకుణ్ని చంపాడు. ఎందుకంటే అతను "శూద్రుడు" కాబట్టి, శూద్రుడు తపస్సు చేయటం వేదాలు నిషేధించాయి కాబట్టి అని వివరణ. (ఉత్తరకాండ, 76వ అధ్యాయం)

47. లక్ష్మణున్ని నదిలోకి తోసి, రాముడు ఒక సాధారణ మనిషిగానే నదిలో దూకి చచ్చిపోయాడు. (ఉత్తరకాండ, 106వ అధ్యాయం). చచ్చాక పోకిరి - ఇంద్రుడుగా తిరిగి జన్మ ఎత్తాడు. (ఉత్తరకాండ, 110వ అధ్యాయం).

48. రాముడు తన చేతిని చూస్తూ సంస్కృత శ్లోకంలో సంభోదిస్తాడు. "ఓ నా కుడిచేయీ, నీవు ఈ తుచ్ఛమైన శూద్రుణ్ణి ఏ అనుమానం లేకుండా చంపు. చచ్చిన బ్రాహ్మణ కుర్రాడు తిరిగి ప్రాణంతో లేవటానికి ఈ శూద్రుణ్ని చంపటం ఒక్కటే మార్గం కనుక చంపు. నీవు రాముడి అవయవాల్లో ఒకటి కాదా?" (వాల్మీకి రామాయణం)

**గమనిక :** ఏ తప్పూ చేయని శంభుకుడు తపస్సు చేస్తుంటే దయాదాక్షిణ్యంలేకుండాచంపిన రాముణ్ణి విష్ణు అవతారమని అభివర్ణించారు! అటువంటి రాజులే యిప్పుడుంటే ఎంతఘోరం! "శూద్రులనేవాళ్లు" ఎక్కడికి పారిపోవాలి!

49. రాముడు విరిచేసిన విల్లు శివుడిది. అదివరకే ఆ విల్లంబు విరిగివుంది. అభిదాన చింతామణిలో 157, 331, 571, 663, 894, 1151, 1173, 1494 పేజీలను చూసి పరిశీలించండి.

50. ప్రచురణయిన వివిధ రామాయణాలు ఈ విషయాన్ని ధ్రువపరుస్తున్నాయి. రాముడు విల్లు విరిచినపుడు అతని వయస్సెంతో చూడండి. అతని తల్లి లెక్క ప్రకారం అతను విల్లు విరిచే నాటికి అతని వయసు అయిదేళ్ళు. సీతలెక్క ప్రకారం అప్పటి అతని వయస్సు పన్నెండేళ్ళు. అతని వయస్సు సంగతిఎలా వున్నా అతను విరిచిన విల్లు అదివరకే విరిగిన విల్లనే వాస్తవం ఆ కథను బట్టి తెలుస్తోంది.

## నవలార్ సోమసుందర భారతియార్ ఉద్దేశ్యాలు

వాల్మీకి రామాయణంప్రకారం రాముడు మంచి మనిషి కాదు. చాలా దుష్ట చర్యల్లో, విద్రోహ చర్యల్లో ఇతగాడి చేయి ఉంది.

తనకు దేశాన్ని పాలించే హక్కు లేదని భరతుడే చట్టబద్ధమైన రాజ్యాధినేతనే వాస్తవం రాముడికి పూర్తిగా తెలుసు.

రాముడు తండ్రి దశరథుడు భరతుడి తల్లి కైకేయితో పెళ్ళి జరిగే సమయంలో ఆమెకు పుట్టిన కుమారుడు అయోధ్యకు రాజు అవుతాడు అని కైకేయి తండ్రికి ప్రమాణం చేశాడు. ఈ షరతును దశరథుడు ఒప్పుకోవటం చేతనే కైకేయిని అతనికిచ్చి పెళ్లి చేశారు.

రాముడికీ విషయం తెలుసు. అతనే ఈ విషయం నిజమైందని ఒప్పుకున్నాడు.

రాముడీ విషయాన్ని భరతుడికి వివరించటమే గాక అతని తల్లి కైకేయిని నిందించవద్దని బతిమలాడాడు.

ఈ విషయం రాముడి తల్లి కైసల్యకు, వశిష్టుడికి, ఇతర ఋషులకు, మంత్రులకు అందరికీ తెలుసు.

క్లుప్తంగా చెప్పాలంటే-రాముడి తల్లి, ఋషులు, గురువులు, మంత్రులు భరతుడికి రాజ్యం రాకుండా దశరథుడిచే రాముడికి వచ్చేట్లు చేయటానికి పన్నిన కుట్రలో భాగస్వాములే.

రామాయణంపై ఒక అమెరికా వాని అభిప్రాయం-(ఓ బై మీనన్)

దీన్ని రష్యా పత్రికలో ప్రచురించాడు.

**రామాయణాన్ని గూర్చి ఒక అమెరికావాని వివరణ-** "రాముడు చికాగో ముఠా రౌడీలాంటి మనస్తత్వం కల్గిన వాడు, సీత చాల చిన్న మనస్తత్వం ఉన్న ఆడపిల్ల, తనను రావణాసురుడు బలవంతంగా ఎత్తుకు పోతుంటే సంతోషపడిన పిల్ల"-1954 లో సోవియట్

మోసం చేయటానికి వాళ్ళు నటిస్తున్నారు''.

10. "దశరథుణ్ణి, కైకేయిని అడవులకు తరిమేసి నిన్ను సింహాసనం మీద కూర్చోపెడ తాను'' అంటూ ప్రతిగ్న చేస్తాడు.

11. "ఈ సింహాసనాన్ని అధిష్టించటానికి తిష్టపడకపోతే, నేను రాజ్యాన్ని వశం చేసుకొని ఏలుతాను'' అని అంటాడు.

(పై 8, 9, 10, 11 విషయాలకు అయోధ్యకాండ, 23వ అధ్యాయం చూడండి)

12. దేశాన్ని విడిచి అడవికెళ్తూ "ఎవడయితే అయోధ్యను వేశ్యలతో అలంకరిస్తాడో వాదే ధన్యుడు'' అని అంటాడు. (అయోధ్యకాండ 51వ అధ్యాయం)

13. "మళ్లీ మనం అయోధ్యకు క్షేమంగా తిరిగి రాగలమా!'' అనీ నిట్టూర్చుతాడు. (అయోధ్యకాండ, 51వ అధ్యాయం)

14. రాముడి దగ్గరకు భరతుడు వచ్చి ఎంతో మర్యాదగా అణకువగా రాముణ్ణి అడవులనుండి బయలుదేరి తమ దేశానికి తిరిగి వచ్చి రాజ్యమేలమని రాముణ్ణి అడుగుతుంటే చూసి లక్ష్మణుడు భరతుడిపై ఆగ్రహించి "వీణ్ణి ఇప్పుడే చంపుతాను'' వొర్లుతాడు.

15. అతను అడవిలో విరాటుని చూసి "భరతుడు రాజ్యాన్ని కాజేయటానికి తోడ్పడిన వీడిన అంతం చేసి నా కసి తీర్చుకుంటాను'' అంటాడు. (అరణ్యకాండ, 2వ అధ్యాయం).

16. అతను శూర్పణకతో అంటాడు కదా "సీత గుణహీనురాలైన ఆడది. దాని వక్షం (చళ్లు) ముసలివయిపోయినై.'' (అరణ్యకాండ 18వ అధ్యాయం).

17. సీతపట్ల అతని ప్రవర్తన అటువంటిది కాబట్టే సీత, తనని తాను ప్రేమిస్తున్నాడని, తనను అనుభవించటానికి వాంఛిస్తున్నాడని లక్ష్మణుణ్ణి అనుమానించింది.

18. "సీతనెవరయినా ఎత్తుకుపోనీ! ఆమె చావనీ! మనకేమిటి! ఒక నీచమైన ఆడదాని కోసం మనం బాధపడాలా?'' అని అతని అన్నతోనే అతని అన్న సొంత భార్యగురించి, ఏ గౌరవం లేకుండా తిరస్కారంగా మాట్లాడాడు.

19. తాటికి, శూర్పణక, అయోముకి మొదలైన ఆడవాళ్ల ముక్కుల్ని, చెవుల్ని, చళ్లను, వాళ్ల అవయవాల్ని కోసి వాళ్లను వికారుల్ని చేశాడు లక్ష్మణుడు.

20. "రాముడు దుఃఖంలో మునిగిపోయాడు కాబట్టి, అతనికతనే నీకు లొంగిపోయాడు. అతని మీద దయచూపు'' అని సుగ్రీవుడు ముందు తనకు తానే ఆ విధంగా లొంగిపోయాడు.

21. అటువంటి లక్ష్మణుడే ఒకానొక సమయంలో ఈ సుగ్రీవుణ్నే చంపటానికి ఆగ్న ఇవ్వమని రాముణ్ణి కోరతాడు.

22. రాముడు లక్ష్మణుడు సీతతో ఎన్నో అబద్ధాలాడి, మోసపూరితంగా కడుపుతున్న ఆమెను అడవులకు తీసుకెళ్ళి అక్కడే వదిలేశాడు.

23. రాముడు, భరతుడు ఇద్దరు లక్ష్మణునికి అన్నలవుతారు. లక్ష్మణుడు రాముడి పట్ల విధేయుడుగాను, భరతుడి పట్ల విరోధిగాను ఉన్నాడు. అదేవిధంగా కౌసల్యతో అణకువగాను. కైకేయితో తిరస్కారంగాను వ్యవహరించాడు. ఎందుకోసం ఇట్లా అయ్యాడు? సింహాసనం అధిష్టించాలనే పెద్ద ఆశతో కాక మరిదేనికి?

## ఈ దిగువ చెప్పిన వ్యక్తులను గూర్చి-

భరతుడు, కైకేయి, సుగ్రీవుడు, శత్రుఘ్నుడు, అంగద, కౌసల్య, వశిష్టుడు, విభీషణుడు,

సుమిత్ర, హనుమంతుడు, రావణుడు, వాలి క్లుప్తంగా పరిశీలిద్దాం.

## 9 భరతుడు

అతనిలో ఏ మంచి గుణాలు అంత పెద్దగా కనిపించవు.

1. అతని తాతగారింట్లో ఆటకాయి తనంతో, పిల్లవాడిలా పది సంవత్సరాలుగా ఉండిపోయాడు.
2. అక్కడి నుండి రమ్మని కబురుపంపితే అయోధ్యకు తిరిగి వచ్చాడు.
3. తల్లి దండ్రుల్ని చూడాలని కాని, సొంత ఇంట్లో గడపాలని కాని అతనికే ఆసక్తి లేదు.
4. తాత గారింటి దగ్గర నుండి తిరిగొచ్చాక రాముడు దేశ బహిష్కారం పొంది అడవికెళ్లాడని తెలుసుకొని రాముడలా వెళ్లిపోటానికి అతను (రాముడు) ఏ ఆడదాన్నయినా బలవంతంగా చెరచాడా అని తెలుసుకోగోరతాడు. (అయోధ్యకాండ 72వ అధ్యాయం)
5. తన తల్లిని కుప్ప తిప్పలుగా చివాట్లు వేస్తూ ఆమెనెన్నో పేర్లతో తిట్టాడు. "ఒక హంతకురాలివి, దయ్యానివి, అంజవి, దుర్మార్గురాలివి, తుంటరి దానివి, నీవు చస్తే మంచిది. దేశం నుంచి పారిపో. నేను నీ కొడుకునని చెప్పుకోటానికి చింతిస్తున్నాను" అంటాడు. ఆ రాజ్యానికి న్యాయబద్ధంగా అతను రాజు కావలసి ఉంది కాబట్టి, అలా చేయటానికి ఆమెంతో కష్టపడితే ఆమెను తెలివి తక్కువగా, అటువంటి బాధకలిగించే మాటలతో ఆమెను తిట్టాడు. అక్కడ వాస్తవ పరిస్థితుల్ని, ఆమె తల్లిని సరిగా అర్థం చేసుకోలేదు.
6. అతని తండ్రిని అతడు ద్రోహి అని పిలిచాడు. (4, 5 అంశాలకు అయోధ్యకాండ 73, 74 అధ్యాయాలు చూడండి)
7. అడవిలో రాముడితో మాట్లాడుతూ "దేశానికి తిరిగి వచ్చి సుఖసంతోషాలిచ్చే రాజస్త్రీ జనాల మధ్య తులతూగుతూ రాజ్యాన్నేలు" అని ప్రాధేయపడతాడు. (అయోధ్యకాండ 105వ అధ్యాయం)
8. భరతుడికి కూడా చాలామంది పెళ్లాలున్నారు.

## 10. శత్రుజ్ఞుడు

వీడొక చచ్చు గాడిద.

1. తన తల్లి సవతి కైకేయిని తిట్టాడు.
2. మంధరను కిందకుతోసి కొట్టి ఆమె ఎముకలిరగ గొట్టాడు. మొదట నుంచి ఆమెకు అన్ని రహస్యాలు తెలుసునని, తన యజమానురాలైన కైకేయికి విశ్వాసంగా, విధేయంగా బాధ్యతగా న్యాయాన్ని నిలబెట్టటానికి కృషి చేసిందని ఆమెను శత్రుగ్నుడు కొట్టాడు.

**గమనిక:** ఇక్కడ గమనించాల్సిందేమిటంటే - భరతుడు, శత్రుగ్నుడు వాళ్ళ తల్లి దండ్రుల్ని తిట్టి రాముడి పట్ల శ్రద్ధచూయించారు.

## 11. కౌసల్య

దిగజారి పోయిన ఒక కుటుంబంలో వ్యవహరించినట్లు ఆమె బహుభార్యల్ని చేసుకున్న భర్తకు భార్యగానడుచుకొంది.

1. తన కొడుక్కి ఏ విధంగానైనా, ఏ పనిచేసైనా, సరే పట్టం గట్టాలని ఆమె మనస్సులో అంతులేని ఆశ ఉంది.

2. అసూయతో కైకేయిని ద్వేషిస్తుంది.
3. "నేను ముసలిదాన్నయ్యాను. నా శరీరంలో అందమంతా పోయింది" అని ఆమె బాధపడుతుంది (అయోధ్యకాండ 20వ అధ్యాయం)
4. భర్త మీద ఏ మాత్రం గౌరవం లేకుండా అతన్ని చెడ్డగా మాట్లాడింది.

## 12. సుమిత్ర

1. తన కొడుకునెటూ రాజును చేయరని తెలిసి రాముడు రాజు కావటానికి చాలా ఆతురతపడింది.
2. "రాముడు పద్నాలుగు సంవత్సరాలు గడిచాక వెంటనే అయోధ్యకు వచ్చి భరతుణ్ని తోసివేసి రాజ్యాన్ని లాక్కుంటాడు. ఇప్పుడేమీ బాధపడకు" అని కౌసల్యను ఓదార్చింది.

ఈ విధంగా చాలా స్పష్టంగా వీదిద్దరూ భరతుణ్ని తీవ్రంగా వ్యతిరేకించారు.

## 12. కైకేయి

1. ఆమె ధైర్యవంతురాలు, అందగత్తె కూడాను. అందరూ ప్రశంసించే రాణి ఆమె.
2. రెండు సందర్భాలలో తన భర్త ప్రాణాల్ని కాపాడింది.
3. భర్త ప్రాణాలన్నీ కాపాడింది కాబట్టి రాజ్యం ఆమె చేతికొచ్చింది. అంతేగాక దశరథుడు ఆమెను పెళ్లి చేసుకునేప్పుడు రాజ్యాన్ని ఆమెకు అప్పజెప్పాడు.
4. భరతుడు కైకేయితో "రాజ్యాన్ని రాముడికి అప్పజెపుతాను, అప్పజెప్పేశాను కూడా" అని అన్నప్పటికీ అలా కాదని ఏ వ్యతిరేకతను ఆమె చూపలేదు.
5. తనకు న్యాయబద్ధంగా రావలసిన రాజ్యాధికారం హక్కును స్తిరం చేసుకోటానికి చాల ప్రయత్నం చేసింది. ఏ చెడు ఉద్దేశాల్ని కార్యరూపంలో పెట్టటానికి కాని, వాటి కోసం ఏవైనా భ్రష్టు పనులు చేయటానికి పూనుకోలేదు.

## 14. సుమంత్రుడు

తను మంత్రి అయినప్పటికీ నిజాయితీ మంచితనం ఉన్న వాడు కాదు.

1. దశరథుడితో మంతనాలు జరిపి అతనికి చెడు సలహాలిస్తూ వచ్చాడు.
2. రాజు భార్య అయిన కైకేయితో చాల నీచంగా మాట్లాడాడు. (అయోధ్యకాండ, 35వ అధ్యాయం)
3. అబద్ధాలు కూడా చెప్పాడు.

## 15. వశిష్టుడు

గురువుగారయిన వశిష్టుడు ఒక మామూలు పురోహితుడికి మిన్నగా వ్యవహరించలేదు.

1. రాజ్యం భరతుడిదేనని తెలిసి కూడా రాముడికి పట్టాభిషేకం చేయటానికి కుట్ర చేశాడు.
2. కుట్రకు దోహదం చేస్తూ పట్టాభిషేకం త్వరగా జరిగి పోవటానికి ముహూర్తం ఏర్పాటు చేశాడు.
3. రాముడి పట్టాభిషేకానికి అతను నిర్ణయించిన శుభముహూర్తం అతన్ని అడవులకు పంపే చెడు దినంగా మారింది.

## 16. హనుమంతుడు

అతను మామూలు మనిషే. ఎక్కడా వివేకంతో వ్యవహరించలేదు. అతనికి కీర్తి ప్రతిష్టలు తెచ్చిపెట్టిన అందరూ అనుకునే, అతని దివ్యశక్తులు హేతుబద్ధమైన ఏ కారణానికీ నిలబడవు.

1. అన్యాయంగా అర్ధరాత్రి పూట లంకకు నిప్పుపెట్టి అమాయకులైన ఎంతో మంది నిస్సహాయుల ప్రాణాల్ని తీశాడు. అలా ఎంతో వినాశానికి కారకుడయ్యాడు.
2. సీతతో మాట్లాడుతున్నప్పుడు పచ్చిబండబూతు పదాలతో మగవాడి లింగం మొదలైన విషయాల్ని కూడా ముచ్చటిస్తాడు. ఇక్కడ ఆడవాళ్లముందు వాటిని గూర్చి చర్చించకూడని పదాలవి. (సుందరకాండ, 35వ అధ్యాయం)

## 17. వాలి

ఏ చెడునూ ఆపాదించటానికి వీలు లేని వాడు వాలి.

1. తన తమ్ముణ్ని చంపాలని కోరలేదు.
2. సుగ్రీవుడే అతనితో అనవసరంగా తగువు పెట్టుకున్నాడు.
3. వాలి సహజంగా ఎవరికీ హాని చేసే గుణం కలవాడు కాదు. అందుకని అతడే తప్పు చేయలేదు.
4. తమ్ముణ్ని చంపనని తన భార్యతో ప్రమాణం చేసి అతనితో పోరాటానికి దిగాడు.
5. చాల ఓర్పు ఉన్న వాడే కాక బలవంతుడు కూడా.
6. మంచి నడవడి, ధర్మ ప్రవర్తన ఉన్న మనిషి
7. అతనికెదురుగా నిలిచి ముఖాముఖి అతనితో పోరాడటానికి ధైర్యం ఎవరికీ లేదు.
8. చాల మంది గొప్ప వాళ్లకు అతను ప్రాణ స్నేహితుడు.
9. రాముణ్ని సరిగా అర్థం చేసుకోలేక అతను నిజాయితీపరుడని, మంచివాడని నమ్మాడు.
10. వాలి చచ్చిపోయినప్పుడు వాలి యొక్క ఉన్నత గుణాల్నిచెప్తుతూ సుగ్రీవుడు "అటువంటి మహనీయుడైన అన్నను కోల్పోయాక నేనూ బతకను. మంటల్లో దూకి చస్తాను'' అన్నాడు.

    అటువంటి మహనీయుడైన వాలిని చంపటాన్ని రాముడు సమర్థించుకుంటూ "అడవి జంతువుల్ని చంపటానికి ధర్మసూత్రాల్ని అనుసరించాల్సిన పనిలేదు'' అన్నాడు. వాలి ఒక అడవి జంతువా?

## 18. సుగ్రీవుడు

అతను తన అన్నను మోసం చేశాడు. తన అన్నను చంపటం కోసమే అతను రాముడికి బానిసయ్యాడు.

## 19. అంగదుడు

వాడి తండ్రిని రాముడు అక్రమంగా చంపినా రాముడితో స్నేహం చేశాడు. గౌరవమంటే ఏమిటో ఆలోచనలేని మనిషి వీడు.

1. వీడి పినతండ్రి అయిన సుగ్రీవుడు మీద ప్రేమగాని, మంచి అభిప్రాయం కాని ఏమీ లేవు.

2. వాడేమిటో వాడికే తెలియక, ఏ షరతులు లేకుండానే ఒక బానిసగా లొంగి పోయి ప్రవర్తించాడు.

## 20. విభీషణుడు

1. లంకకు రాజు కావాలనే దురాశతో తన కుటుంబ శత్రువైన రాముడికి లొంగి పోయి తన అన్న చావుకు కారకుడయ్యాడు.
2. ఇంద్రజిత్తుతో రామలక్ష్మణులు ఓడిపోయి కింద పడిపోయినప్పుడు విభీషణుడు విలపిస్తూ "రామలక్ష్మణులు గొప్ప పరాక్రవంతులని నమ్మి నా భవిష్యత్తును చక్క దిద్దుకుందామని వాళ్ల అండ చేరాను. నా ఆశలన్ని కూలి పోయినై. రాజ్యాన్ని కోల్పోయి ఏమి చేయలేక కూలిపోతున్నాను. నా శత్రువు రావణుడు తన పంతం నెగ్గిందని తెగ సంతోషడుతున్నాడు" ఆ విధంగా బాహాటంగా తనకు రాగూడని రాజ్యానికి అధిపతి కావాలనే విపరీతమైన దురాశను వెల్లడించాడు. (ఉత్తరకాండ, 49వ అధ్యాయం) ఈ విషయాన్ని రాముడికి హనుమంతుడు, సుగ్రీవుడు, ఇతరులు ఎత్తి చూయించారు కూడా.
3. అంతా ఇలా అనుకోవటం రాముడికి కూడా తెలిసి "మనకు కావాల్సింది అలాంటి నీతిలేని నీఛులే" అన్నాడు (ఉత్తరకాండ, 17వ అధ్యాయం)
4. రావణుడు బతికుండగానే రాముడు తనకు పట్టం కట్టాడు, దానికి అతను ఎంతో పొంగిపోయాడు. (ఉత్తరకాండ, 18వ అధ్యాయం)
5. ఆ తరువాత విభీషణుడు ఎన్నో దాచిన రహస్యాల్ని రాముడికి వెల్లడించాడు.
6. రావణుడు సీతనెత్తుకోపోయాడనే నెపంతో రాముడికి తన సర్వస్వాన్ని అర్పించుకొని తన అన్న రాజ్యాన్ని అపహరించటానికి కుట్ర చేశాడు. అతన్ని ప్రేరేపించిన అసలు కారణం లంక నేలాలనే ఆశ తప్ప ధర్మబద్ధమైన ఏ ఆలోచన కాదు.

## ఏ విధంగానంటే-

7. రాముడు రావణుడి రాజ్యంలోకి అక్రమంగా ప్రవేశించి అక్కడ జంతువుల్ని వేటాడటాన్ని తన ద్రుష్టికి తెచ్చుకోలేదు.
8. అతని సోదరిని, అతని ఇతర బంధువులైన స్త్రీలను ముక్కులు చెవులు కోసి, తల వెంట్రుకలు గొరిగుళ్లు చేసి వాళ్లను అందవికారులుగా చేసినప్పుడు, మరి కొంత మందిని చంపినప్పుడు కూడా విభీషణుడే మాత్రం ఉడికి పోలేదు. వీటేటికీ అతను చలించలేదు.
9. ధర్మపరాయణుడు, ధీరుడైన వాడు, తన ఆధీనంలో ఉన్న సీతను ఎంతో గౌరవంతో చూపిన రావణుని ఒక దుర్మార్గుడుగా చిత్రించి ఎన్నో ఘోరమైన తప్పిదాలు చేసి తన అన్నకు ద్రోహం చేసి లంక రాజ్యాన్ని వశం చేసుకోవాలనే పెద్ద దురుద్దేశముంది. స్వార్థం, నీచ మనస్తత్వం తప్ప ఈ దుర్మార్గాలన్నింటికి కారణం ఇంకేమైనా చెప్పగలమా?

## 21. రావణుడు

1. ఎంతో చదువిన ఒక విద్యావంతుడు.
2. ఒక మహాముని

3. పాత గ్రంథాలు (వేదశాస్త్రాలు) క్షుణ్ణంగా తెలిసిన పండితుడు.
4. తన ప్రజల్ని, బంధువుల్ని దయతో పాలించి కాపాడే రక్షకుడు.
5. ధైర్యవంతుడు
6. మహాశక్తివంతుడు.
7. వీరోచితంగా పోరాడే సైనికుడు
8. ఎంతో పవిత్రుడు.
9. భగవంతుడికి ప్రియమైన కుమారుడు.
10. ఎన్నో వరాలు పొందిన వాడు.

ఈ పది మేలు గుణాల్ని రావణునికున్నాయని వాల్మీకే వివరించి ఎన్నో సందర్భాల్లో అతణ్ని పొగడుతాడు.

2. ఈ దుర్మార్గుడైన విభీషణుడు తన అన్న రావణుడు రాజ్యమేలుతుంటే చూచి సహించలేక కుట్ర చేసి అతని చావుకు కారకుడయ్యాడు. రావణుడు చనిపోయినప్పుడు సోదర భావంతో కుమిలిపోతూ అతని శవం మీద పడి ఏడుస్తూ, రావణుని గొప్పగుణాల్ని పేర్కొంటూ అతనికి శ్రద్ధాంజలి పడుతూ విభీషణుడు అంటాడు "ధర్మాన్ని నిర్వర్తించటానికి నీవెప్పుడూ వెనుకాడలేదు. గొప్ప వాళ్ళందరినీ గౌరవించావు" (ఉత్తరకాండ, 111వ అధ్యాయం)

3. తన చెల్లెలకు జరిగిన అవమానానికి, ఆమెపై జరిపిన క్రూరత్వానికి, పాశవిక చర్యకు రెచ్చిపోయి ఆవేశాన్ని అణచుకోలేక వాటికి ప్రతీకారంగా రావణుడు సీతను లంకకు ఎత్తుకెళ్లాడు. ఆమె మీద ప్రేమ ఉండి కాని, ఇంకొకరి భార్యను చెరచాలనే దురుద్దేశ్యంతో కాని ఆ పని చేయలేదు.

4. హనుమంతుడు తనమాటల్లో రావణుడి ప్రేమ విషయాల్లో ఉన్న లాలిత్యాన్ని గూర్చి చెపుతూ "రావణుని అంత:పురంలో ఉన్న స్త్రీలందరు, వాళ్ళకు వాళ్ళే యిష్టపడి, తమ ఇష్టానుసారంగా తమను తామే అతనికి భార్యలుగా అర్పించుకున్నారు. ఏ స్త్రీని ఆమె యిష్టం లేకుండా అతను తాకలేదు. అంటే ఎవ్వరినీ బలవంతం చేయలేదు. (సుందరకాండ, 9వ అధ్యాయం)

5. రావణుడు దేవతల్ని, ఋషుల్ని ద్వేషించాడు. ఎందుకని? వాళ్ళు యాగం లేక అగ్నికి అర్పితం చేయటం అనే పేరుతో నోరులేని మూగ జంతువుల్ని చాల క్రూరమైన విధానాలతో చంపే ఘోరమైన హత్యాకాండ జరుపుతారు. అందువల్లే వాళ్లను ద్వేషించాడు. అంతకన్నా వేరే కారణలేమీ లేవు.

వాల్మీకే చెప్పాడు "రావణుడు చాల మంచివాడు, అతను చాల గొప్ప హృదయం కలవాడు, మంచి అందగాడు కూడాను. కాని 'బ్రాహ్మలు' యాగాలు చేస్తున్నట్లు, సోమరసం తాగుతున్నట్లు ఎక్కడ కన్పించినా అతను వాళ్లను హతమార్చేవాడు"

6. వాల్మీకే అంటాడు. అతణ్ని ఇతరులు తీవ్రంగా ఆక్రోషపరచినప్పుడు తనను తాను అణచుకోలేని కోపోద్రేకతకు గుర్వైనప్పుడు, అత్యంత తీవ్రమైన మనస్తాపాన్ని అణుచుకోలేని సమయంలోనూ, రామలక్ష్మణులు శూర్పణకకు చేసినట్లు రావణుడు ప్రతీకార ఉద్దేశ్యంతో సీత ముక్కు, చెవులు కోసి కసి తీర్చుకోవాలనే ఆలోచనకే విధంగానూ తావీయలేదు.

7. ఒక పని పూర్తి చేయాలనే ఉద్దేశ్యంతో సీతను ఏకాంతంగా అడవిలో వదిలి పోతే, ఆ పరిస్తితే సీతను రావణుడు ఎత్తుకొని వెళ్లటానికి వీలు కల్పించింది. సీత కూడా రావణుడు వచ్చి తనను తీసుకొని వెళ్లాలని అందుకు వీలుగా ప్రయత్నాలు చేసింది. ఈ విషయంపై ఈ ద్రుక్కోణంలో ఎన్నో రామాయణ అనువాదాల్లో వివరణలు కనిపిస్తాయ్.
8. ఆ తరువాత రావణుడు అతని మంత్రులతో జరిపిన సమాలోచనలు, చర్చలు అతని యొక్క గొప్ప రాజనీతిని చాటుతాయి.

**గమనిక:** పైన వివరించిన విషయాలకు ఆధారాలు- రామాయణంలోని పాత్రలు గూర్చి, ఆ పాత్రల గుణగుణాలు, ప్రవర్తన వాటి ఔచిత్యాలను గూర్చి వివరించటానికి వాల్మీకి రాసిన రామాయణాన్ని, తమిళంలో 'బ్రాహ్మల'చేతనే అనువాదం చేసిన వివిధ రామాయణ గ్రంధాలు ఆధారాలు. ఇప్పుడు మన పాఠకులు ఇంత కాలం వరకు ఆ పాత్రలపై ఉన్న తమ అభిప్రాయాలు పూర్తిగా తప్పని తెలుసుకోగలుగుతారు.

## ఇంకా వివరంగా చెప్పాలంటే

రామాయణంలో ఏ వ్యక్తులయితే ముక్కు సూటిగా నిజాయితీతో, న్యాయబద్ధంగా వ్యవహరించారో వారిని పనికి రాని వాళ్లుగా, హీనంగానూ, మరొక వైపు నమ్మక ద్రోహుల్ని, కుట్రపూరితంగా వ్యవహరించిన పనికి రాని వెధవల్ని చాల నిజాయితీపరులని, గొప్ప వాళ్లని, దేవుళ్లని, పూజించతగిన వారని అనుకుంటున్నారు. అటువంటి అర్ధం పర్ధం లేని ఆలోచనలను పోగొట్టటానికి, సరిగా ఆలోచించే బుద్ధిపరులకు ఈ విషయాలు తేటతెల్లం చేయాలని, ఈ పుస్తకం యొక్క ముఖ్యఉద్దేశ్యం.

## బెంగాలి రామాయణం

బెంగాలీ భాషలో రాసిన "లంకావతారసూత్ర" అనే పుస్తకంలో రావణుడు ద్రావిడరాజని, అతను బౌద్ధమతాన్ని పాటించాడని, ప్లేటో, ఆరిస్టోటిలు లాంటి తాత్వికవేత్త అని రాశారు. ఎందుకంటె బౌద్ధ గ్రంథాలలో రావణుణ్ని గూర్చి చాల గొప్పగా చెప్పారు. బ్రాహ్మలు, పండితులు వారు రాసుకున్న రామాయణంలో రావణుణ్ని దుష్టుడుగా వర్ణించారు. కీర్తివాసుడు ఆయన రామాయణంపై రాసిన రచనల్లో రావణుడు ప్రేమతో కరుణతో తన దేశాన్ని పాలించాడని రాశారు.

రావణుడు యుద్ధంలో చనిపోతూ రాముణ్ణి తన దగ్గరకు పిలిచి 'దయ-సిద్ధాంతాన్ని' చెప్పాడు. రాముడు అతని చెవిలో సన్నగా చెపుతూ, ఆ యుద్ధంలో రాముడు మోసం, దగాలతో వ్యవహరించాడని కూడ చెప్పాడు. ఈ వివరణ కీర్తివాసుడు రాసిన రామాయణంలో మనం చూస్తాం. రావణుడు నిజాయితీని, మంచి తనాన్ని బోధించాడని ఈ గ్రంధం-124 పేజీలో ఉంది.

## రామాయణ కాలంలో మత్తు పానీయాల రకాలు
## (తాగుడు నీళ్ల రకాలు)

(డాక్టరు యస్.యన్.వ్యాస్ 'రామాయణంలో తాగుళ్లు' అనే శీర్షికతో ఒక వ్యాసాన్ని ఢిల్లీ నుండి వచ్చే కార్వాన్ పత్రిక 15.8.1954 న ప్రచురించారు)

1. **కితైసుర-** వంట చేసి తయారు చేసిన సారాకు ఈ పేరు పెట్టారు.

2. **మిరాయ-** మషాళాదినుసుల నుండి తయారు చేస్తారు. దీన్ని కూడా మత్తు పదార్థమని పిలుస్తారు.

3. **మధ్య-మాంచి** మత్తు కలిగించే పానీయం.

4. **మంథ-** మత్తు కలిగించని సాధారణ పానీయాలలో యిదొకటి. 'పిత్తమంద' అని కూడా దీన్ని పిలుస్తారు. దీనిలో అంత మత్తు ఉండదు కాబట్టి దీనికి చాల మంది యిష్టపడేవారు.

5. **సురాపానం-** దీనికి కిత్తైసురకు తేడా వుంది. కిత్తైసురను ఆయా దినుసులతో ప్రత్యేకంగా తయారు చేస్తారు. 'సుర' ప్రక్రుతి సిద్ధంగా దొరికే మత్తు పానీయం. మామూలు వడపోత పద్దతిలో దీన్ని తయారు చేస్తారు. ఇది అందరూ తాగే సాధారణ పానీయం. పురాణాల్లో దీన్ని గురించి చాల ఎక్కువగా చెప్పారు.

6. **సిధు-** బెల్లం తయారిలో మిగిలి పోయిన జిడ్డు నుంచి దీన్ని తయారు చేస్తారు.

7. **సౌవెక్రక-** ఒక తక్కువ రకం పానీయం

8. **వారుణి-** ఆ రోజుల్లో తాగే మత్తు పానీయాల్లో ఇది ఎక్కువ. మత్తునిచ్చేది. దీంట్లో దట్టమైన సారారసం ఉండి విపరీతమైన మత్తును కలుగుజేస్తుంది. దీన్ని తాగిన వెంటనే తూలిపోతారు.

## రాముడు, సీత - పాత్రీకరణ

(వాల్మీకి రామాయణం మీద ఇ.వి. రామసామి నాయకర్ తన ఉపన్యాసాలలో చేసిన వ్యాఖ్యల నుండి సంకలనం చేసింది)

రామయణంలో ఉన్న తప్పుడు భావాల్ని, దాంట్లో ఉన్న మురికి కంపును ఎత్తి చూపించటానికి మేం చేసే ప్రయత్నాలను అందరు 'బ్రామ్హల' పండితులు, పత్రికలు వ్యతిరేకిస్తూ ఎదుర్కుంటున్నారు. వాళ్ల పత్రికల్లో వెనువెంటనే రామసామి నాయకర్ "రాముడొకలుచ్చా, సీతొకలంజ" అని అన్నాడని ప్రచురిస్తారు. నేను మాట్లాడిన వాటి నుండి ఒక వాక్యంలేక, ఒకటిలేక రెండు మాటలు తీసేసి నేనే సందర్భంలో ఏ కారణంగా అన్నానో చెప్పకుండా ఎదిరిస్తారు. దీన్నే మంటారు? నామాటల్ని కత్తిరించి వికారంగా అతికించి విక్రుత అర్థాలు కల్పించి ప్రచారం చేస్తే ప్రజలు నామీద ఎదురుతిరుగుతారని వాళ్ళ ఉద్దేశ్యం.

రామాయణం ఈనాడు మామూలు జనం అనుకుంటున్నట్లుగా అది భగవంతుడి కధకాదు. అదొక కాకమ్మకధ. ఈవాస్తవాన్ని చాల మంది గుర్తించారు. గాంధీగారే ఆశ్చర్య పడుతూ అన్నాడు "నా రాముడు రామాయణంలో రాముడు కాదు" అని.

"కలియుగ కంభుడు" అని పేరు గాంచిన టి.కె. చిదంబర నాధ మొదిలియారు గారు రామాయణం భగవంతుని గాధ కాదని, అదొక రచన మాత్రమే నన్నారు. బొంబాయిలో కొందరు మేధావుల సహాయంతోనూ బిర్లాలాంటి బాగా పెరిగిన ధనవంతుల ఆర్థిక సహాయంతోను "భారత ఇతిహాస సమితి" నొకదాన్ని ఏర్పాటు చేశారు. వాళ్లు "వేదకాలం" అనే పుస్తకాన్ని ప్రచురించారు. దాంట్లో ఏ పురాణాలకు చరిత్ర ఆధారాలు లేవన్నారు. అవి ప్రజలకు ధర్మాలు నీతులు బోధించ గల్గినవి కావు, అవి ఉత్త కల్పితాలు అని వివరించారు. సి. రాజగోపాలచారి గారు కూడా రాముడు దేవుడు కాదని, కాకపోతే ఒక వీరుడని ప్రకటించారు.

## భగవంతుడిఅవతారమా?

చాల మంది పరిశోదనా శాస్త్రజ్ఞులు, విజ్ఞానులు రాముడు భగవంతుడి అవతారం కాదని, రామాయణం లాంటి భగవంతుడిది నిజమైన జీవితగాధ కాదని ఒకే రకమైనఅభిప్రాయానికి వచ్చారు. మొదట రామాయణం రాసిన వాల్మీకి కూడా అతని రచనల్లో ఎక్కడా భగవంతుడ్ని అవతారంగా చూడాలని రాముడికి ఉన్నత గుణాల్ని అంటగట్టలేదు. అసలు ఆకథ కొనసాగటానికి ఎక్కడ నుండి ప్రారంభమైందో ఆ మొదటి గట్టమే అర్ధంలేని చెత్త. ఇక్కడ విష్ణు ఒకసారెప్పుడో బ్రిగు మహార్షి భార్యను చంపాడట. అందుకని ఆముని అతణ్ని మనిషిగా పుట్టాలని భార్యను పోగొట్టుకొని బాధగా ఏడవాలని శపించాడని ఒక కధ నడుస్తుంది.

ఇంకొక కధలో ఈ విష్ణే జలందరాసురుడి భార్య బృంధ అందాన్ని చూసి వ్యామోహితుడై ఆమె భర్తను (జలంధురిడిని) చంపి, జలంధరుని వేషంలో ఆమెను మోసం చేసి ఆమె శీలాన్ని చెరిచాడు. ఆమెనతను సంభోగిస్తున్నప్పుడు అతని నిజస్వరూపం తెలుసుకొని తన నెట్లా మోసం చేశాడో కూడా తెలుసుకొని "నీ భార్యకు నాలాంటి కర్మ పట్టుగాక" అని ఆ విష్ణును శపించింది. ఆ శాపం వలన అతను ఈ భూమి మీద తిరిగి జన్మించాడట. మరొక చోట యింకోవిధంగా తిరుమాళ్ అంటే విష్ణు అతని భార్య తిరుమగళ్‌తో పట్టపగలు సంభోగం చేస్తున్నప్పుడు శివగణం యొక్క నాయకుడు అతని దగ్గరకొచ్చాడు. అతన్నేమీ పట్టించుకోకుండా తిరుమాళ్ సంభోగించటం ఆపకుండా అలాగే కొన సాగించాడు. తన మీద సాగిన ఈ నిర్లక్ష్యానికి పొంగిపోతున్న కోపంతో శివగణ నాయకుడు నంది దగ్గరకు పరుగెత్తికెళ్లి తననెలా విష్ణు అవమాన పరిచాడో వివరించి చెప్పాడు. దాని మీద నంది విష్ణును "తిరుమాళ్ భూమి మీద పుట్టుగాక, భార్యను పోగొట్టుకొని విలపించుగాక" అని శపించాడు. అందుకని తిరుమాళ్ భూమి మీద తిరిగి జన్మించాడు.

అతను తిరిగి పుట్టటానికి ఇవి ఎలాంటి అర్ధం పర్ధం లేనిచెత్త కారణాలు! ఇప్పుడు అతడు పుట్టిన కుటుంబాన్ని గూర్చి చూద్దాం. రాముడి తండ్రి దశరధుడికి అతనికున్న పట్టపురాణులైన భార్యలు కాక యింకా అరవై వేల మంది భార్యలున్నారు. అటువంటి ఆదర్శప్రాయుడైన తండ్రికి రాముడు ఒక కుమారుడుగా పుట్టాడు. ఇంకా చెప్పిందేమిటంటే రాముడు లక్ష్మణుడు తదితరులు యాగం జరపటం వలన అంటే బలి ఇవ్వటం వలన పుట్టారు. ఇప్పుడు యాగం యొక్క విశిష్టతల్ని పరిశీలించండి. ఎన్నో రకాలయిన పక్షుల్ని, జంతువుల్ని, కీటకాల్ని, పాకులాడే పురుగుల్ని యింకా యితర జీవుల్ని మంటల్లో వేయించి వాటిని (అవి చాల పవిత్రమైనవని నుడివారు) 'బ్రాహ్మణులు' ఆరగించారు. తరువాత దశరధుడి భార్యల్ని పురోహితుల కప్పగించారు. (యాగం జరిపిన వాళ్ళు) వాళ్ళు దశరధుడి భార్యలకు గర్భదారణ చేశారు. రామాయణాన్ని బెంగాలి భాషలో అనువాదం చేసిన వారిలో ఒకరైన పండిత్ మన్మధనాధ తాతార్ రామాయణంలో ఈ యాగ విషయాన్ని గూర్చి ఈ విధంగా చెప్పారు-

"కౌసల్య చెక్కు చెదరకుండా నిలబడి మూడు వేట్లు వేసి ఒక గుర్రాన్ని నరికింది. చేసేది తప్పు అని విచారపడకుండా చచ్చిన గుర్రంతో రాత్రంతా గడిపింది. హోత, అద్వార్యు, ఉక్త, యితర పూజారులు (రుక్విక్కులు) ఆరాచ స్త్రీలను సంభోగించారు." దశరధుడి కొడుకు రాముడి జన్మ వృత్తాంతం అటువంటిది!

భగవంతుడు అవతారమెత్తే పద్ధతి అలా ఉండాల్సిందేనా? ఆ కధను అంత అసహ్యాకరంగా రాయాల్సిందేనా?

## దశరధుని దుష్టస్వభావం

రాముణ్ని దేశాదీశుణ్ని చేయటానికి ఒక ప్లాను ప్రకారం చేసిన ప్రయత్నాల్ని పరిశీలిస్తే కోసల రాజ్యాన్నేలుతున్న కుటుంబంలో జరుగుతున్న కుట్ర, దశరధుడి దుష్ట స్వభావం బయట పడుతుంది. భరతుణ్ని తాత గారింటికి పంపి పది సంవత్సరాల వరకు అతన్ని తిరిగి పిలవకుండా అక్కడే ఉంచాడు. అతను ఉంటే రాముణి పట్టాభిషేకానికి అవాంతరం తప్పకుండా కలుగుతుందని ఆలోచించాడు. రాముడి పట్టాభిషేకానికి ఏర్పాట్లు చాల తొందరగా జరిగాయి. కైకేయ రాజుకు ఆహ్వానం పంపలేదు. భరతుడికి కూడా ఈ వేడుకను గూర్చి చెప్పలేదు. దశరధుడు రాముడితో ఆంతరంగికంగా మాట్లాడుతూ "భరతుడు వాళ్ల తాతగారింట్లో ఉండి యిక్కడ లేకుండా ఉండటం నీ పట్టాభిషేకానికి వీలు కల్పించింది. అతను తిరిగి వచ్చే లోపుగా ఈ పట్టాభిషేకాన్ని పూర్తి చేయాలి. రేపు పొద్దున్నే ఇది జరగాలి. ఈ రాత్రి దీనికి వ్యతిరేకంగా జరగటానికి వీలులేకుండా నీస్నేహితులు నీకు తోడ్పడాలి." రాచకుటుంబానికి చెందిన బంధువులు, ప్రజలు అందరు ఆవేడుకను గూర్చి సంతోషించారు. రాముణ్ని, భరతుణ్ని ఏ తేడా లేకుండా సమానంగా చూసుకుంటున్న కైకేయికి మాత్రం యీ విషయం తెలియకుండా ఉండేట్లు దశరధుడు చేశాడు. తనకుతానే ఎలాగో ఈ విషయాన్ని కైకేయి తెలుసుకున్నాక దశరధుడు చేస్తున్న కుట్ర ఆమెకర్థమయి తన కొడుకు భరతుణే రాజ్యమేలాలని, రాముణ్ని రాజ్యం నుండి వెళ్లగొట్టి అడవికి పంపాలని బాగా పట్టుపట్టింది. దశరధుడు ఆమెకీ విషయం చెప్పకుండా దాచిన దానికి ఏ సంజాయిషీ చెప్పలేక ఆమె కాళ్ల మీద పడి ఆమె కిచ్చిన వరాల్ని అమలు చేయవద్దని సిగ్గులేకుండా బతిమాలాడు. వేడుక కని చేసిన ఏర్పాట్లన్నిటిని నాశానం చేసిందని ఆమెను నిందించాడు.

అతను రాముడితో రహస్యంగా మాట్లాడుతూ అతన్ని అడవులకు పంపాలని తాను మనసారా ఇష్టపడటం లేదని, కైకేయి కిచ్చిన మాటను నిలబెట్టుకున్నానని, తన నిజాయితీని చూపటానికి మాత్రమే అలా చేశానన్నాడు. తన ఆగ్నను తోసిపుచ్చి రాజ్యాన్ని స్వాధీనం చేసుకోమని దశరధుడు రాముణ్ని ప్రేరేపించాడు కూడా. రాముడితోపాటు అడవికి రాజబొక్కసంలో ఉన్న మొత్తం ధనాన్ని, రాజసైన్యాన్ని, వేశ్యల్ని వెళ్లమని కోరాడు.

కైకేయిని పెళ్లి చేసుకునేప్పుడు దశరధుడు ఆమెకో ప్రమాణం చేశాడు. ఆమెకు పుట్టిన కొడుకు రాజ్యానికి విధిగా వారసుడౌతాడని ప్రమాణం చేశాడు. ఎంతో నమ్మకంగా చెప్పి చేసిన ప్రమాణం కాదని రాముడికి పట్టం గట్టటానికి ఏర్పాట్లు చేశాడు. ఈ రాముడనే పెద్ద మనిషి రాజ్యం భరతుడికే చెందుతుందని తెలిసి కూడా దీనికి అంగీకరిస్తాడా! ఈ నికృష్టమైన పనిని దశరధుడి మంత్రులు, గురువు, సుమంత్రుడు, వశిష్టుడు కూడా బలపరచారు. రాముడు అడవికి వెళ్లాలని దశరధుడు ప్రకటించాక లక్ష్మణుడు తన తండ్రిని చంపుతానని కేకలేశాడు. తండ్రి ఆగ్నను లెక్క చేయ్యకుండా రాజ్యంలోనే ఉండిపొమ్మని కౌసల్య తన కొడుకు రాముడికి సలహా ఇచ్చింది.

## ఒక మామూలు మనిషి కన్నా చాల హీనంగా

రాముణ్ని, అతని సహచరుల్ని ఆ విధంగా రామాయణంలో చాల చోట్ల నీచమైన

పద్ధతిలో వర్ణించారు. రాముడి 'మంచి మంచిగుణాలు' ఏమిటంటే అమాయకురాలైన తాటకిని వెర్రి ఆవేశంతో చంపాడనిచెప్పుకోవాలి. ఆమెరాజ్యంలో చొరబడి చట్టవ్యతిరేకంగా, ఆమె దేశ నియమాలకు వ్యతిరేకంగా యాగాల్ని జరపటానికి పురోహితులకు అనుజ్ఞ యివ్వలేదనే నెపంతో ఆమెను రాముడుచంపాడు.

అతను అడవికెళ్లవలసివస్తే బాధతో విలపిస్తూ ఆ రాజ్యం తనచేతికి దక్కబోతున్న సమయంలో తననుండి జారిపోయిందని, అంతేగాక తనను అడవి కెళ్లాలని ఆజ్ఞాపించారని తల్లితోను, భార్యతోను వాపోయాడు.

అడవిలో లక్ష్మణుడితో రాముడు "ఏబుద్ధిలేని వాడయినా ఎంతో వినయంగా బాధ్యతగా ఉండే కొడుకును అడవికి పంపుతాడా?" అని అంటాడు. అలా రాజ్యం రాలేదని పట్టరాని దు:ఖంతో తండ్రిని తూలనాడాడు.

అడవిలో శూర్పణకను వికారిగా చేశాడు. ఎందుకంటే ఆమె అతన్ని ప్రేమించింది. తనకు తానే యుద్ధానికి దిగాడు. తాను రాక్షసుల్ని చంపాలనే ధ్యేయంతోనే అడవికొచ్చానన్నాడు. సుగ్రీవుడి కోసం దొంగచాటుగా, పిరికి పందగా నిలిచి తనకే విధమైన కీడుచేయని వాలిని చంపాడు. విభీషణుడు ఒక దగుల్బాజీ అని, కుట్రదారుడని తెలిసి కూడా, రావణుని చంపి లంకాధీశుడు కావాలనే క్షుద్ర ఆలోచనతో తన దగ్గరకు వచ్చాడని గుర్తించి కూడా, అతణ్ని రాముడు సమర్థించాడు. రావణుడు ఒక వైపు లంకను పాలిస్తున్నా విభీషణున్ని లంకకు రాజును చేస్తూ అతనికి కిరీటం పెట్టాడు.

## కుట్ర ఆలోచనలు

రాముడు చెప్పే దొకటి చేసేదొకటని, కుట్ర పూరిత స్వభావం కలవాడని రామయణం అంతటా కనిపిస్తుంది. అతను దేనికైనా సిద్ధమే. తాను కోరింది సాధించుకోటానికి ఎంత నీచానికైనా దిగజారి ఏ పని చేయటానికైనా సిద్ధమే.

అతని వెంట సీత అరణ్య వాసానికి పోవలసివుంటే, ఆమె అంత:పురంలోనే ఉండి భరతుడి తీయని హృదయాన్ని చూరగొనమని, అందువలన తాము కొంత సాధించటానికి వీలు పడుతుందని కోరుతాడు. అందుకు సీత కోపంతో కస్సుమని అతని మీద విరుచుకుపడి "నీవు నపంసకుడివి. నీవు మగవాడివేషంలో ఉన్న ఆడదానివని (కొజ్జా వాడివని) తెలియక నా తండ్రి నన్నిచ్చి నీకు పెళ్లిచేశాడు. భార్యను ఇతరులకు తార్చి భుక్తి సంపాదించే వాడిలాగా నీవు మాట్లాడుతున్నావు" అని కేకలేసింది. ఆమె మాటలకు తలకిందులై కాళ్ళుపైకెత్తేసినట్లు ఆమెను అనునయిస్తూ "నీ మనస్తత్వాన్ని పరీక్షించాలని అలా అన్నాను" అని అన్నాడు. తర్వాత ఆమెను అరణ్యానికి తీసుకెళ్లాడు. ఎప్పుడయినా ఏదయినా అపాయం సంభవించదని అతనికి తోస్తే తనకు తగిన విధంగా కాక కైకేయిని ఆడిపోస్తూ తనకష్టాల్ని చూచి ఆమె చాల ఆనందపడుతూ ఉంటుందని అంటాడు. అతను అడవికొచ్చేశాడని, తనతండ్రి ముసలివాడయ్యాడని, భరతుడు తిరుగులేని రాజయిపోయాడని, అతన్ని ప్రశ్నించే వాళ్లేవరూ లేరని గొణుక్కునేవాడు. అప్పుడు మళ్లా ఏంచేశాడు? శూద్రుడయిన వాడు తపస్సు చేస్తున్నాడని శంభుకుని చంపాడు. అటువంటి పనికి మాలినోణ్ని, నీచమనస్తత్వమున్న మోసగాణ్ని భగవంతుడి అవతారమని ఎలా అనాలి? మోసపూరిత బ్రాహ్మణులు అటువంటి నమ్మరాని వాణ్ని, నపుంసకుణ్ని, పనికి మాలినోణ్ని, గుణహీనుణ్ని భగవంతుడని మనం

అతణ్ణి కొలవాలని, పూజించాలని అంటారు. ఈ తప్పిదాలన్నిటిని నిశితంగా పరిశీలించాల్సిన బాధ్యత మన అందరి మీద లేదా?

ఇవి రాముడి యొక్క గుణాలు. ఇక సీతను గురించి చూదాం. రామాయణం పొడుగునా ఆమె ఒక సాధారణ స్త్రీగానే చెప్పారు. మంచి సంప్రదాయంలో పెరిగి, లజ్జ, శీలం వంటి ఉండవలసిన మంచి గుణాలతో ఉన్న స్త్రీ కాదు. జగడాల మారి కూడా. ఆమె తల్లిదండ్రుల ఉనికే అనుమాన పడాల్సినటువంటిది. ఆమె ఎవరికి పుట్టిందో ఎవరికీ తెలియదు. జనకుడు నాగలితో భూమి దున్నుతుంటే ఆనాగటిచాలులో మట్టికింద అతనికి దొరికిందని చెప్తుతారు. ఈ అపకీర్తినుండి ఆమెను కాపాడటానికి "మహాలక్ష్మి దేవత" కడుపున పుట్టిందని కాదు చెప్పటం, ఆమెకు ఆమే ఒక పసిపాపలా భూమి మీద అవతరించిందని చెపుతారు. ఆమె తల్లిదండ్రులెవరో అని అందరూ అనుమానపడటం చేత ఆమె పెద్దమనిషయిన చాల కాలం వరకు పెళ్లికాకుండా ఉండి పోయింది. ఈ విషయాన్నే ఆమే అడవిలో ఉన్నప్పుడు వివరించింది. "మహాలక్ష్మి" అలా జన్మెత్తిందని చెప్పటానికి ఏ ఆధారంలేదు. చాల హాస్యాస్పదమైనట్టిది ఆమె.

కథమొత్తంలో ఆమె పాత్రలో మెచ్చుకోదగినదేమీ లేదు.

## సీత యొక్క ఆడంబరం

రాముడు అడవికివెళ్లాలని నిర్ణయమైనాక, సీతవిషయంలో జ్యోతిష్యులు కూడా ఆమెకు అరణ్యావాసం ఉందని అంతకు పూర్వమే చెప్పారని దాన్ని పూర్తి చేయటానికే ఆమె కూడా తన భర్తతో అడవికెళ్తానని చెప్పింది. రామలక్ష్మణులు చెట్ల నుండి తీసిన నారతో తయారు చేసిన నారబట్టల్ని కట్టుకున్నారు. అటువంటి బట్టలేసుకోటానికి సీత ఒప్పుకోలేదు. అందుకని ఆమె కోసం పద్నాలుగేళ్లకు సరిపోయే వస్త్రాలు, ఆభరణాలు ఆమెతోపాటు పంపాల్సిందని దశరధుడు ఆగ్నాపించాడు. వాటిని చాల అందంగా ధరించుకుని సంతోషపడింది. భర్త నారబట్టలతోనా! అతని ప్రియాతిప్రియమైన భార్య రాచవస్త్రాలతోనా! ఆ విధంగావాళ్లు అడవికి వెళ్లారు. వాళ్లలా అడవికెళ్తున్నప్పుడు రాముడు మాత్రమే అడవి కెళ్లాలని దశరధుడు ఆగ్నాపించాడు కాని, సీతను కాదుగదా అని వశిష్టుడు, సుమంత్రుడు, యితరులు సీతను అడవికి పంపవద్దని వ్యతిరేకించారు. దీనికి కైకేయి ఒప్పుకోలేదు. అందువలన ఆమె తన భర్తతో అడవికెళ్లటానికి అంగీకరించింది. ఆదర్శప్రాయమైనటువంటి పతివ్రత అని అనుకుంటున్న ఆ స్త్రీ యొక్క ప్రవర్తన- సీత యొక్క ప్రవర్తన అంతటితో ఆగలేదు. రాముడి తల్లి, సీత అత్తగారు సీతకు ఆభరణాలపైన, నగిషి వస్త్రాలపైన ఉన్న మోజును చూసి "నీ మొగుడి ప్రేమకు తగ్గట్లుగా నడుచుకో, కొంటెగా వ్యవహరించకు" అని బుద్ధి చెప్పింది. దీనికి ఆమె అత్తగారికి సమాదానమిస్తూ "నాకన్నీ తెలుసు. నీనుంచి నేను నేర్చుకోవాల్సిందేమి లేదు' అని అంది. రాముడు "భరతుడితో ఉండిపో" అని సీతను కోరినప్పుడు తనను తక్కువగా చూసే భరతుడితో ఉండజాలనని ఎదురు తిరిగి సమాధానం చెప్పింది.

వాళ్లు అడవిలో కష్టాల్లో ఉన్నప్పుడు, లేక ఏదైనా ఉపద్రవం వచ్చి పడుతుందని అనుకున్నప్పుడు ఆమె కైకేయిని దారుణంగా తిడుతుంది.

**జగడమాడే గడుసు ఆడది కూడా ఆమెను చూసి వణుకుతుంది.**

రాముడు లేడిని వెంటాడినప్పుడు అది చచ్చిపోతూ బాధతో "సీతా! లక్ష్మణా!" అని

అరిస్తే, సీత "లక్ష్మణా మీ అన్నకు సాయం చేయటానికి పరుగెత్తు" మని ఆజ్ఞాపించింది. లక్ష్మణుడు "మా అన్నకే అపాయం వచ్చి పడదు" అంటాడు. అందుకు ఆమె మండిపడిపోతూ "రాముడు చస్తే నన్ను పొందవచ్చని ఆశిస్తున్నావుకదూ? నీవు అడవి కొచ్చిందీ ఉద్దేశ్యంతోనా? నాకు తెలుసు నీవూ భరతుడు నన్ను మాయ జేసి అనుభవించాలని పన్నాగంపన్నారు." అంటూ లక్ష్మణుణ్ని ఆక్షేపించింది. దీనికి లక్ష్మణుడు వొణికిపోతూ చేతులు ముడుచుకొని అన్నాడు. "ఓహ్! అమ్మా! నీకాళ్ళు తప్ప మరేదేన్నీ ఎప్పుడూనేను చూడలేదు. దయ చేసి అట్లా మాట్లాడవద్దు" అలా అంటే సీత స్పందించి ప్రశ్నించింది "ఇట్లా మాట్లాడుతూ నన్ను చూస్తూ తృప్తి పడటానికి కాలయాపన చేస్తున్నావా?" 'అవతారమెత్తిన దేవత', జగన్మాత, ప్రపంచానికే తల్లి అయిన ఆమెనోటి నుండి వచ్చిన మాటల తీరు చూడండి. ఒక జగడాల మారి ఆడది కూడా యిట్లా మాట్లాడటానికి దడుస్తుంది. అయినా సీత అట్లా మాట్లాడింది. అటువంటి దురుసుతనం ఆడది ఈ విశ్వమంతా నిండిన మహాను భావుడికి అర్ధాంగి అని కొనియాడుతున్నారు. ఆవిడ ఆదర్శప్రాయంగా జీవించటానికి, ప్రజలకు ధర్మాలు నీతులు ప్రభోధించటానికి ఈ భూమి మీదకు దిగివచ్చిన అవతారం అని చెప్పారు. సీత జీవితం యొక్క 'గొప్పదనం' దీంతోనే అయిపోలేదు!! ఇంకాచాలా ఉంది.

## రావణుడు సీత అందాన్ని ఒక్కొక్క భాగం వర్ణిస్తాడు!!

### 1. సీత రావణుడికి తిండి పెట్టింది.

సీత తెలివి తక్కువ తనానికి మండిపోతూ ఎలాంటి సిగ్గు, లజ్జ, హుందాతనం లేనిపనికి మాలిన మనిషని ఆమెను తిట్టుకుంటూ వెళ్లిపోయాడు లక్ష్మణుడు. వెంటనే అది వరకే ఏర్పాటు చేసినట్టు రావణుడు "సన్యాసి" వేషంలో రంగ ప్రవేశం చేస్తాడు, సీత అతణ్ని సాదరంగా ఆహ్వానిస్తుంది. రావణుడు సీత అందాన్ని గూర్చి వర్ణించటం మొదలుపెడతాడు. సీత కళ్లని పళ్లని,. ముకాన్ని, తొడల్ని ఆమెస్తనాల్ని కూడా తాటిపళ్లతో పోల్చుతూ - అన్నీ వర్ణించాడు. "నేను నిన్ను చూడగానే, నీశరీర అవయవాల్ని చూసి నాప్రేమను అణచుకోలేక పోతున్నాను. నది గట్టుల్ని కోసినట్లుగా నీ అందం నా హృదయాన్ని కోసేస్తోంది" అలా సౌందర్యాన్ని ఒక్కొక్క భాగం వర్ణిస్తూ పోతాడు. సీత నిజంగా శీలవతి అయితే ఆమెను చూచి అందరూ అనుసరించదగినంత ఆదర్శప్రాయమైన గుణవంతురాలైతే ఆమె అప్పుడు ఏంచేసి ఉండాలి? ఎవడైనా మనస్త్రీలను అంత చెడ్డగా లెక్కగట్టగలడా? ఒక వేళ అలా చేస్తేవాడు తప్పించుకొని పోతానని ఆశించగలడా? చేతిలో ఏదుంటే దాంతో వాణ్ని చితక బాదకుండా వదులుతారా? కాని అప్పుడు సీతేమి చేసింది? అతని వర్ణనకు ముగ్ధురాలై అతనికి తిండి పెట్టింది.

### 2. సీత తన అసలు వయస్సును దాచి ఆమె యుక్త వయస్సురాలునని చెపుతుంది:

అతనికి తిండి పెట్టాక తాను జనకుడి కూతురునని, రాముడి భార్యనని, యింకా, యింకా తనను గురించి చెప్పుతూ పోతుంది. తన వయస్సు దాచి ఉన్న దాని కన్నా తక్కువ వయస్సు దాన్నని చెపుతుంది. దావణుడితో మాట్లాడుతున్న సమయానికి ఆమె అడవికి వచ్చి పదమూడేళ్లు గడిచినై తనకు పెళ్ళాయినప్పటి నుండి పన్నెండేళ్ళుగా అయోధ్యలో ఉంటున్నానని చెప్పింది. అంతేగాక తాను అడవి కొచ్చాక అప్పటి తన వయస్సు 18 ఏళ్లని చెప్పింది. ఇదేలా

సరిపోతుంది పెళ్లయ్యాక అయోధ్యలో 12 ఏళ్లుగా ఉంటున్నదని చెప్పింది. తాను పెద్ద మనిషి అయిన తర్వాత కూడా చాల కాలం వరకు పెళ్లి కాకుండా తన తండ్రి యింట్లోనే ఉన్నానని ఆమే చెప్పుకుంది. రావణుడికి చెప్పిందాన్ని బట్టి ఆమె 6 ఏటనే ఆమెకు పెళ్లయి ఉండాలి. ఇలాంటి సొళ్లు మాటలెందుకు చెప్పింది? అతని ముందు తన ముసలి తనాన్ని దాచటానికే. అప్పటికామె వయస్సు 45 ఏళ్లు దాటి ఉండాలి. పెద్ద మనిషయిన చాలా ఏళ్ల వరకు ఆమెకు పెళ్లి కాలేదు కాబట్టి పెళ్లయ్యే సమయానికి కనీసం 20 ఏళ్లు ఉండాలి. (అయోధ్యలో 12 ఏళ్లు, అడవిలో 13 ఏళ్లు, పెళ్లయ్యేసరికి 20 ఏళ్లు. అందువలన 45 ఏళ్లు) ఈ వయస్సును లక్ష్మణుడు కూడా ధ్రువపరచాడు. కడపు జారిపోయి వయస్సు ముదిరిన స్త్రీ సీతని అంటాడు. అతనెప్పుడు చెప్పాడు? శూర్పణక రాముణ్ణి ప్రేమించి పెళ్లి చేసుకోవాలని కోరుతుంది. దానికి రాముడు తనకిది వరకే ఒక భార్య ఉందని, పెళ్లి కాకుండా బ్రహ్మచారిగా ఉన్న లక్ష్మణుడి దగ్గరకు ఆమెను వెళ్లమని చెపుతాడు. అలాగే ఆమె లక్ష్మణుడి దగ్గర కెళ్ళింది. లక్ష్మణుడు తాను రాముడికి బానిసనని చెప్పుతూ, రాముడి భార్య పొట్టజారిపోయి ముసలిదయిపోయిందని అతని దగ్గరకే తిరిగి వెళ్లమని ఆమెను పంపిస్తాడు. కథ అలా సాగుతుంటే రావణుడు సీతను కలిసినప్పుడు ఆవిడ పెద్ద వయస్సులోనే ఉంది. నిజానికి ఆమె ముసలిదయినా, రావణుడు ఆనందంగా ఆమె అవయవాల్ని ఒక్కొక్కటే వర్ణిస్తూ పోతుంటే ఆమె తన వయస్సునెందుకు దాయవలసివచ్చింది? దీని మీద కాస్త ఆలోచించండి! అందరూ శీలవతి అని దేవతని చెప్పుకునేటువంటి స్త్రీ కథ ఇదేనా? అప్పుడేమైంది? తాను రావణుడని తెలియపరచి, తనతో పాటు ఆమెను లంకకు రమ్మని ఆమెను తొందర పెట్టాడు. ఆమె తిరస్కరించింది. అప్పుడతను ఒక చేత్తో ఆమె జుట్టుపట్టు కొని రెండో చేత్తో ఆమె నెత్తి తన తొడల మీదకు లాక్కుని తీసుకొనిపోయాడు. ఆమె ఏడ్చింది. కథ అలా నడిచిపోతుంది.

## "నా భౌతిక శరీరం ఎక్కడో ఉంది, కాని నా మనసు నీతోనే ఉంది"

ఈ కథలోగమనించాల్సిన మరో విషయం ఉంది. రావణుడికి రెండుశాపాలున్నాయి. ఒకటి ఏ స్త్రీనయినా ఆమె యిష్టం లేకుండా అతను తాకితే అతని శరీరం భగ్గున మండిపోతుంది. రెండు అతని తలవేయివక్కలై పగిలిపోతుంది. ఈ విషయాన్ని మనసులో ఉంచుకొని తమిళకవి కంబన్ సీతను చేతులతో తాకకుండా ఆమె నిలబడిఉన్న భూమిని ఆమెతోపాటు అలాగే పెళ్లగించి రావణుడు ఎత్తుకు పోయాడని రాశాడు. ఈ విషయాన్నే ధ్రువపరస్తూ ఇంకో రచనలో రావణుడు తీసుకెళ్లింది నిజమైన సీతను కాదని, ఆమె ప్రతిరూపాన్ని మాత్రమేనని కథ నడుస్తుంది. మూడో రచనలో ఆమె నీడను మాత్రమే తీసుకెళ్లాడని చెప్పారు. కాని వాల్మీకి రాసిన మూల రచనలో రావణుడు ఆమెశరీరాన్ని తాకాడని, తన వొళ్లో అదిమిపెటుతూ ఆమెను తీసుకెళ్లాడని చాల స్పష్టంగా రాసివుంది.

అతను ఆమె శరీరాన్ని తాకి పట్టుకు పోతుంటే అతని పైన ఉన్న శాపపు కోరలు బుసకొట్టి అతని తలను శరీరాన్ని బూడిద చేసుండేవి. కాని అతనికేం జరగలేదు. లంకకు సురక్షితంగా వచ్చాడు. ఆమెను తనరాజభవనంలోకి తీసుకొని వచ్చాడు. అక్కడకూడా ఏదారుణం అతనికి జరగలేదు. అయినప్పుడు దీని అర్థమేమిటి?

రావు సాహెబ్ దినేశ్ చంద్రసేన్, బి.ఏ. ప్రసిద్దిచెందిన బెంగాలి చరిత్ర పరిశోధకుడు,

కలకత్తా యూనివర్సిటీ మెంబరు ఈ విషయం మీద ఇలారాశారు--- "రావణుడు సీతను బలాత్కారంగా ఎత్తుకు పోయాడనటానికి ఏవిధమైన ఆధారాలు లేవని నా నిర్ణయం. ఈ నా నిర్ణయం మీద సనాతన ధర్మపరాయణులు కోపంతో మండిపోవచ్చుకాని నా నిర్ణయాన్ని నేను మార్చుకోటం లేదు. సాహిత్య సౌందర్యాల తెరను మీరు చించి చూస్తే అక్కడ ఉత్త ఎముకలగూడు మాత్రమే కనిపిస్తుంది."

లంకలో రావణుడు సీతతో వున్నప్పుడు "ఓ సీతా! సిగ్గుపడకు. మనకలయిక అభగవంతుడు చేసిన ఏర్పాటు. దీన్ని రుషులందరు ఆహ్వానిస్తున్నారు" అని అన్నాడు. సీత అతనికి సమాదానంగా "నీ యిష్టమొచ్చినట్టు నా శరీరాన్ని వాడుకో! నాశరీరాన్ని గూర్చి నేనేం పట్టించుకోను" అని అంది. రావణుణ్ని చంపి సీతతో రాముడు తిరిగి వస్తున్నప్పుడు అతను "రావణుడి ఆధీనంలో చాల కాలం వున్నావు. అతను నిన్ను తాకకుండా నిన్ను అనుభవించకుండా వదిలిపెట్ట గలిగాడా" అని అన్నప్పుడు సీత "నేనేంచేయగలను. నేను ఒంటరిగా ఉన్నాను. పై పెచ్చు ఒక ఆడదాన్ని. అతను శక్తివంతుడు. నాయిష్టంతో ఏదీ జరగలేదు. నా మనసు అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడు కూడా నీతోనే ఉంటుంది" అని అంది. అతనడిగినదానికి సూటిగా సమాదానం చెప్పలేదు. డొంక తిరుగుడుగా చెప్పింది. "నా శరీరం నాకు అదుపులేదు. కాని నాకు నిష్కల్మషమైన మనసుందని నీకు గట్టిగా చెప్పగలను" అంటుంది. వంకర తిరిగిన వివరణ ఏవేవో పదాలతో సమాదానం చెప్పింది. చివరికి సీత ఇంటికి తిరిగి వచ్చాక ఆమె శీలం పవిత్రంగానే ఉందని ప్రమాణం చేసి చెప్పమని రాముడు కోరితే ఆమెలాచేయలేదు. కాని ఆమె భూమిలోకి తనంతటతాను కుంగిపోయి కనిపించకుండా పోయింది. మరోమాటలో చెప్పాలంటే ఆమె ఆత్మహత్య చేసుకుంది.

## రాముడి చుట్టూ ఉన్న వాళ్లు కూడా అప్రతిష్టాకరమైన వాళ్లే !

ఆమెకు భర్తగా ఉన్న రాముడు నిజాయితీ పరుడుకాడు, మోసగాడు, ఆడంగిల వాడు, నమ్మదగ్గిన వాడు కాదు. ఆమె మరిది లక్ష్మణుడు ఒక విద్రోహి. తన తండ్రినే చంపటానికి సాహసించాడు. వాడొక చెడిపోయిన భ్రష్టుడు. రాజ్యం కోసం ఏ పని చేయటానికైనా వెనుకాడని వాడు. రాముడు తండ్రి 60 వేల సంవత్సరాల వయసులో కూడా స్త్రీ చాపల్యుడు. తన కొడుకులందరిని సమాన ద్రుష్టితో చూడక ఒకరిని దగ్గరకు తీసి మరొకరిని దూరంగా ఉంచాడు. రాముడు తల్లి ఆమె భర్తను కూడ పట్టించుకోలేదు. సుమిత్రకూడా అటువంటిదే! దశరధుడు చనిపోయాడు. అప్పుడు కౌసల్య సుమిత్ర అతనికి దగ్గరే పడుకొని ఉండి గాఢ నిద్రలో ఉన్నారు. అతని చావుకు ఇతరులు ఏడుస్తుంటే అప్పుడు వాళ్లు గాఢ నిద్రనుండి లేచారు. దీన్ని బట్టి వాళ్ల భర్తమీద వాళ్లకెలాంటి నిర్లక్ష వైఖరి ఉందో తెలుస్తుంది. సుగ్రీవుడు, విభీషణుల స్నేహం కోసం రాముడు వాళ్లను కలిశాడు. వాళ్లుత్త మోసగాళ్ళు వెధవలున్ను. రాజ్యాలు సంపాదించటం కోసం వాళ్లన్నల్ని కుట్ర చేసి చంపిన వాళ్ళు. రాముడి స్నేహిత బృందం మొత్తం ఒక దొంగల ముఠా. అయినప్పటికీ వాళ్లందరినీ దేవుళ్లని చేశారు. కాని ఈ దైవాంశులనుకునే వారి శత్రువుల్ని కథలో రాసిన దాని ప్రకారం చాల నమ్మకస్తులని, నాగరికులైన వారని మెచ్చుకోవటం జరిగింది.

## రావణుని గొప్పదనం

రావణుని వీరత్వాన్ని గురించి దాదాపు అన్ని చోట్ల ప్రశంసించారు. అతని రాజభవనం

యొక్క ఔన్నత్యాన్ని అందాన్ని హనుమంతుడే మెచ్చుకున్నాడు. రావణుడు అంత:పురంలోని జనానాలో ఎంతో అందమైన ఆడవాళ్ల మధ్యనిద్ర పోతుంటేచూసి అతన్ని తారల దొంతర్ల మధ్య వెలుగుతున్న పూర్ణ చంద్రుడిగా పోల్చాడు. ఆ ఆడవాళ్లందరూ అతని అందాన్ని, విజ్ఞానాన్ని, వీరత్వాన్ని చూసి, అతన్ని వ్యామోహించి వాళ్లంతట వాళ్లు అతనికి భార్యలయ్యారు. వాళ్లలో ఎవరిని అతను బలత్కరించి తీసుకొని రాలేదని హనుమంతుడన్నాడు. సీతకు పెళ్లి కాకముందు ఆమెనక్కడికి తీసుకొని వస్తే చాల కొనియాడదగినదిగా ఉండేదని ఆ హనుమంతుడే తనలో తాను మురుసుకుంటూ ఆలోచన చేశాడు.

వాల్మీకి రావణుని గూర్చి చెపుతూ చాల చోట్ల అతన్ని ఆకాశానికెత్తి వేశాడు. అతను గొప్ప పండపితుడని, ఎన్నో తపస్సులు చేశాడని, వేదాలు క్షుణ్ణంగా తెలిసిన ప్రావీణ్యుడని, అతని ప్రజలకు బంధువులకు మంచి చేశేవాడని, గొప్ప శక్తి కలవాడని, శరీరపుష్టి కలవాడని, ధైర్యసాహసాలున్నవాడని, ఎందరో దేవుళ్ల దయకు పాత్రుడని, వారినుండి ఎన్నో వరాలు పొందిన వాడని వాల్మీకి పొగిడాడు. రాముడి లాగా రావణుణ్ని తక్కువ చేసి చూపలేదు. (రాముణ్ని కుట్ర చేసేవాడని, నమ్మదగిన వాడు కాదని, నపుంసకుడని చెప్పినట్లుగా) రాముడు శూర్పణక అవయవాల్ని కోసి ఆమెను వికారిని చేసినట్లు రావణుడు సీతను చేయ గలడు, కాని అలాంటి ప్రతీకారపు ఆలోచన కూడా చేయలేదు. సీతను అశోక వనంలో తన మేనకోడలి ఆధ్వర్యంలో ఉంచాడు. (రావణుడి సోదరుడి కూతురు ఆధీనంలో) అతను ఉదాత్తుడు. మంచివాడు కూడాను. 'బ్రాహ్మణులు' యాగాలు చేస్తారని, సోమరసం తాగతారు కాబట్టి వారెక్కడ కనిపించినా వారిని రావణుడు తిరస్కరించేవాడని వాల్మీకి అంటాడు.

అటువంటి మంచి గుణాలున్న రావణుణ్ని, అతని జనాన్ని క్రూరమైన రాక్షసులని పిలిచారు. ఎందుకంటే వారు 'బ్రాహ్మణులకు' విరోధులనే చిన్న కారణం చేత.

## వాల్మీకి చిత్రించిన రామాయణం

రామాయణం నిజంగా జరిగి ఉండటానికి వీలులేని ఒక కథ. ఈ ఉద్దేశ్యాన్నే శంకరా చార్యులు లాంటి వాళ్లు, చాల మంది మేధావులు, మతాధిపతులు వెల్ల బుచ్చారు.

రెండవది రాముడు భగవంతుడు రాడని, అతనిలో ఏ దివ్య శక్తి గాని మహిమ గాని ఏవీ లేవని వాల్మీకే చెప్పాడు.

ఇటువంటి పరిస్థితిలో హిందువులు రామాయణం ఒక పవిత్రగాథని, దాంట్లో వివరించిన ముఖ్య మైన వాళ్లను పూజిస్తారు.

ఎందుకని? బ్రాహ్మణులు అటువంటి ప్రచారం చేయటానికి సమర్థవంతులు కనుక, బ్రాహ్మణులు కానివారికి తెలివి, ఆత్మగౌరవం కొరవడి ఉన్నాయి కాబట్టి. అదెటువంటి కారణమైనా రామాయణం లోఉన్న ఈ కింది విషయాల్ని జాగ్రత్తుగా ప్రతిఒక్కరూ పరిశీలించాలి.

1. రాముడు దైవాంశ సంభూతుడా లేక మమూలు మనుషుల కన్నా గొప్ప వాడా?
2. రాముడునిజాయితి ఉన్నవాడేనా?
3. అతనొక వీరుడా?
4. రాముడు తెలివికలవాడేనా? అతను కులపక్షపాతం లేని అతీతుడా?
5. సీత మంచి శీలం కలస్త్రీయేనా?

6. కనీసం ఆమెకు మామూలు స్త్రీ కుండే సాధారణమైన మంచి గుణాలు ఉన్నాయా? రావణుడుగుణహీనుడా?
7. రావణుడు సీతను ఎత్తుకెళ్లాడా?
8. అతను సీతను ప్రలోభ పెట్టి ఆమె శీలాన్ని అపహరించి ఆమెను పాడు చేశాడా?

వైష్ణవుల కోసం రాసిన భాగవతంలో వివరించినట్లు 'రాక్షస' రావణుణ్ని సంహరించటానికి విష్ణు అవతారాల్లో ఒకడుగా రాముడు అవతరించాడు.

విష్ణు అవతారాలు : 1. చేపావతారం 2. తాబేలు అవతారం 3. పంది అవతారం 4. నరసింహావతారం 5. వామన అవతారం 6. రామావతారం 7. పరుశురామావతారం 8. కృష్ణావతారం 9. బలరామ అవతారం.

ఈ తొమ్మిది అవతారాలన్నీ 'బ్రామ్హణులు' (దేవతలు) తరపున వాళ్ల శత్రువులైన ద్రావిడరాజుల్ని (రాక్షసుల్ని) చంపటానికేనని వివరించారు. ఈ తొమ్మిది అవతారాల్లో రామావతారం పైన 'బ్రామ్హణులు' రామాయణం అనే యదార్థంగా జరగని ఒక కధను కల్పించి రాశారు. నంబియాండరునంబి శైవమునుల్ని ఆధారంగా చేసుకొని రాసిన పెరియ పురాణం వంటిదే రామాయణం కధకూడా.

ఇప్పుడు ప్రచారంలో ఉన్న వైష్ణవమునుల కథ "లీలామ్రుతం" లాగానే శైవులు పవిత్రత కోసం ఈ పెరియ పురాణాన్ని సృష్టించారు.

అయితే "రామాయణం" కథ శైవుల కందపురాణం నుండి అనుకరించారు. తేడా పేర్లు మాత్రమే. అంతేగాక కందపురాణంలో ద్రావిడులు (రాక్షసులు) మీద చూపిన కసి కన్నా యింకా ఎక్కువ కసిని చూయించాలనే ధ్యేయంతో రామాయణాన్ని నిర్మించారు.

రామాయణం కన్నా చాల పూర్వం కంద పురాణం పుట్టింది. అందుచేత రామాయణాన్ని ఒక్క మనిషే రాశాడు.

రామాయణం చాల తరువాత కాలంలో రాయడం చేత, ఎంతో మంది అదే రామాయణాన్ని ఎన్నో సార్లు రాశారు. కథ సంధానంలో చాల సందర్భాలలో ఒకరి కొకరికి పొంతన లేకుండా రాశారు. రామాయణంలో వివరించిన దాన్ని బట్టి అందులో ప్రధాన వ్యక్తుల్ని - రాముడు, సీతలను చాల హీనమైన పాత్రలుగా రాశారు.

రాముడికి 5 ఏళ్ల వయస్సున్నప్పుడు తాటకిని ఎక్కడో దాగి చంపాడు. 6 ఏళ్లప్పుడు అతని పెళ్లి అవుతుంది. అట్లా రాముడి జీవిత చరిత్ర ప్రారంభమవుతుంది.

పై రెండు సంఘటనల్లో రాముణ్ని ఏ విధంగాను తీసుకొని రావాల్సింది కాదు. రాముడు 18 ఏళ్ల వాడయినప్పుడు అతని తండ్రితో కలిసి అయోధ్యకు రాజవటానికి పట్టాభిషేకం జరపాలని కుట్ర చేస్తాడు. కైకేయికి దశరధుడు చేసిన ప్రమాణం ప్రకారం ఆమె కుమారుడు భరతుడికే అయోధ్య రాజ్యం చెంద వలసి ఉంటుందని అతనికి బాగా తెలిసి కూడా తన పట్టాభిషేకానికి తలపడతాడు.

దశరధుడి కున్న గాథల్ని గూర్చి మనం చర్చించాల్సిన పనిలేదు. ఎందుకంటే అతను గొప్ప వ్యక్తిత్వం కల వాడనో మంచి ప్రవర్తనలకు ఆదర్శ ప్రాయుడనో ఎవ్వరూ అతన్ని లెక్కలోకి తీసుకోరు. కాని (రాముడతన్ని అనుసరించాడు.) రాముడు మచ్చలేని గుణవంతుడని, అందరూ అతణ్ని అనుసరించాల్సిన ఆదర్శప్రాయుడని, ఎంతో నిజాయితి పరుడని,

గొప్పవీరుడని అందరూ శ్లాగించిన అతడేనా ఈ పని చేసింది. రాముడుకాని, అతని భక్తులుకాని, మతాధిపతులుకాని ఈ సమస్య మీద సరైన వివరణ యివ్వలేక పోయారు.

సి. రాజగోపాలాచారి కూడా తను రాసిన "చక్రవర్తి కొడుకు" అనే పుస్తకంలో పై తప్పిదాలకు సరైన వివరణ యివ్వలేక పోయారు.

వీటిని బట్టి రాముడు ఒక సాధారణ మనిషి మాత్రమేనని మనం ఒక నిర్ణయానికొస్తాం అతను మామూలు మనిషికన్నా చాల తక్కువ వాడనికూడా మనం చెప్పవచ్చు.

ఈ కింది సంఘటనలను బట్టి రాముడు వీరుడు కాదని, ఉత్త పిరికి పంద అని తెలుస్తుంది.

అతనెందరి శీలాల్నో చెరచటమేకాదు, చాల మంది స్త్రీలను చంపాడు. చెట్టుచాటున దాక్కొని, "వాలి" ఎవరితోనో యుద్ధం చేస్తున్నప్పుడు ఒక పిరికిపందలాగా ఏ కారణం చూపకుండానే "వాలి"ని చంపాడు.

రామాయణం కథ పొడుగునా ఎక్కడా రాముడు వివేకవంతుడని చూపలేదు.

దశరధుడీ కింది విధంగా రాముడికి జిత్తుల మారి సలహా యిచ్చాడు. "నా తెలివి తక్కువ తనంతో అయోధ్య రాజ్యాన్ని కైకేయికిస్తానని ప్రమాణం చేశాను. అందువలన నా అంతరాత్మ ఒప్పుకో పోయినా నిన్ను అడవికి పొమ్మని చెప్పవలసి వచ్చింది. నేను చేసిన ప్రమాణానికి బద్ధుడినై నేను వ్యవహరించాలి. కాని నీవు నా నిర్ణయానికి బద్ధుడివి కావాల్సిన పనిలేదు. అందుకని నిన్ను నేను అడవికి పొమ్మని ఆజ్ఞాపించినప్పటికీ నన్ను రాజ్య భ్రష్టుణ్ణి చేశావని, ఈ రాజ్యాన్నేలబోతున్నావనీ ప్రకటించు".

రాముడు ఈ సలహాకు సమాధానంగా అలా చేయటం మంచి పని కాదని చెప్పకుండా, తండ్రి చెప్పినట్లే చేస్తేప్రజలకీ విషయం తెలిసి తనపై తిరుగుబాటు చేస్తారని, అందుకని దశరధుడే రాజ్య పాలన సాగిస్తూ తన పట్టాభిషేకాన్ని వాయిదా వేయమని రాముడు కోరాడు.

రాముడు వివేకవంతుడు కాదని, దురాశా పరుడని ఈ విషయం విశదీపరస్తుంది. తరువాత మారీచుడు అడవిలో లేడి వేషంలో తనముందు కన్పించినప్పుడు సీతకోరిక ప్రకారం ఆ లేడిని పట్టుకోవాలని అనుకున్నప్పుడు, లక్ష్మణుడు అది నిజమైన లేడికాదని, ఏదో ఆపదను తీసుకొని రావచ్చునని ముందుగా హెచ్చరించినా ఆగకుండా దాన్ని పట్టుకోటానికి పోతాడు.

ఈ విషయం రాముడికి మొదడులేదని చెప్పుతుంది. ఈతప్పులన్ని ఎందుకు చూపిస్తూన్నామంటే ఈ విషయాలన్నీ రామాయణానికి రాముడికి మనమిచ్చే గౌరవం, మనం జరిపే పూజలు ఎంత వరకు సమర్ధ నీయమైనవో చూయించటానికీ, ఏ విధంగా "బ్రాహ్మణులు" "బ్రాహ్మణులు" కాని వారిని వారి అమాయకత్వాన్ని బ్రాహ్మణుల స్వార్ధ ప్రయోజనాల కోసం దోచుకుంటున్నారో ఎత్తి చూపటానికి. సైన్సు విజ్ఞానం పెరుగుతున్న ఈ రోజుల్లో కూడా వారింకా వారి పాత ఆటలే సాగిస్తున్నారు. రామాయణ భక్తులీ విషయంపై ప్రజలకు సరైన వివరణలివ్వాలని ప్రజలు ఆవిధంగా కోరాలని మేం అందరికీ పిలుపిస్తున్నాం.

ఇక సీతను గూర్చి ఆలోచిద్దాం-- సీత పుట్టుకే ఒక ప్రశ్న. అంటే ఆమె తల్లిదండ్రులెవరో తెలియదు. అడవిలో ఆమె దొరికిందట. సీత పుట్టుకను గూర్చి చాల రకాలుగా చెప్పారు.

వాల్మీకి రాశాడు- సీత తనకు తానుగా "నేను పుట్టగానే నన్ను అడవిలో దుమ్ములో

పారేశారు. జనకరాజు నన్ను చూసి తీసుకొని వెళ్లి పెంచాడు. నేను యుక్త వయస్సురాలు అయ్యాక నా పుట్టుకను గూర్చి ఉన్న అపఖ్యాతితో ఏ యువరాజూ నన్ను పెళ్లాడటానికి ఒప్పుకోలేదు'' అని చెప్పింది. జనక రాజు సీతకు సరైన వరుణ్ని తీసుకొని రాలేక ఆమె కోసం పెళ్లి కొడుకును చూడమని విశ్వామిత్రుణ్ని కోరాడు. ముని విశ్వామిత్రుడు అయిదేళ్ల రాముణ్ని పట్టుకొచ్చి 25 ఏళ్లకు తక్కువలేని సీతకిచ్చి పెళ్లిచేశాడు. ఈ హెచ్చు తగ్గుల పెళ్లికి సీత ఒక్క మాట కూడా ఎదురు చెప్పలేదు.

మరొక రామాయణంలో (వాల్మీకిది కాదు) జనకరాజు భార్య రాముడి పెళ్లి జరిగే రోజుకు ముందే పెళ్లి జరిగే భవనంలోకి వెళ్లి అక్కడచేరిన జనాన్ని కేకలేస్తూ "గౌరవస్తులారా! మీరందరు వచ్చి శాంతంగా ఈక్రూరమైన వేడుకనెలా చూస్తూ కూర్చున్నారు'' అని అరిచింది. అయోధ్యకు పెళ్లి కుమారుడి వాళ్లు చేరగానే భరతడు సీతను అసహ్యించుకున్నాడు. వాల్మీకి ఈ విషయాన్ని సీత ద్వారానే చెప్పించాడు.

రాముడు అడవికెళ్లే ముందు సీతను అయోధ్యలోనే ఉండి భరతుడి అభీష్టాన్ని చూరగొనేట్లు ఆమె ప్రవర్తించాలని రాముడు సలహాయిస్తే సీత రాముణ్ని కించపరుస్తూ అతణ్ని బాధపెట్టేవిధంగా "నేనేం చేయాలి? భరతుడు నన్ను గౌరవించడు. అతనితో నేనెలా ఉండగలను!'' అని అంది వాల్మీకి ఈ విషయాల్ని సీతతోనే చెప్పించాడు. "ఓ రామా! నీవు వీరుడివి కావు. నీకు మగతనంలేదు. నేను వేశ్యనయినట్లు నన్ను భరతుడితో అక్రమ సంబంధం పెట్టుకోమంటున్నావు. అందువల్ల నీవు అయోధ్యకు రాజయ్యే ప్రతిఫలం పొందుతావు.'' ఆ సమయానికి రాముడి వయస్సు 17 సంవత్సరాలు.

ఈ క్రింది వివరణ వాల్మీకి కౌసల్య నోటితో చెప్పించాడు -- రాముడు అడవికెళ్లబోయే ముందు తన తల్లికౌసల్య దగ్గర సెలవు తీసుకోటానికి వెళ్తాడు. కౌసల్య "ఓ రామా! నీ తండ్రి, నా భర్త అయిన దశరధుడు, నా సవతి స్త్రీ అయిన కైకేయి నన్ను చాల అగౌరపరచారు. ఈ 17 ఏళ్లు ఎన్నో బాధలు పడ్డాను. నీకోసమని బతుకుతున్నాను. లేకపోతే ఎప్పుడో చచ్చేదాన్ని' ' అని అంది. దీనితో మనకు అప్పటి రాముడి వయస్సు 17 సంవత్సరాలని తెలుస్తుంది.

తాటకిని చంపటానికి రాముణ్ని తనతో పంపమని విశ్వామిత్రుడు దశరధుణ్ని అడిగితే దశరధుడు సమాదానమిస్తూ " ఓ మునివర్యా! రాముడు నా వొళ్లో కూర్చునేటివంటి పసివాడు. వాడి పుట్టు వెంట్రుకలు తీసే వేడుకను కూడా యింకా జరపలేదు. అటువంటి పసివాణ్ని యుద్ధ రంగానికే విధంగా పంపమంటావు?'' అంటాడు. దీన్ని బట్టి రాముడికి పెళ్లయ్యేప్పటికి అతని వయస్సు అయిదేళ్లు.

దీన్ని బట్టి తన పెళ్లి సమయానికి యవ్వనంతో వికసిస్తున్న సీత అయిదేళ్ల వయసున్న బాలుడైన రాముణ్ని పెళ్లి చేసుకోటానికి ఒప్పుకుంది. అందుకే రాముణ్ని సీత అంత గౌరవంగా మాట్లాడింది.

రాముడు అడవికెళ్లేముందు సీతను తన ఆభరణాల్ని కరీదైన బట్టల్ని వదిలేసి అతనిచ్చిన గుడ్డల్ని కట్టుకోమన్నాడు. కాని సీత అలా చేయటానికి ఒప్పుకోలేదు. అప్పుడు ఆమె అత్తగారు కౌసల్య యిదంతా చూసి సీత ధరించిన ఆభరణాలు, కరీదైన గుడ్డల మీదనే సీతను కూడా ముని- వస్త్రాలు వేసుకోమని బలవంతం పెట్టి ఒప్పించింది.

రాముడు మాయలేడిని వెంటాడి చంపాడు. అది "ఓ లక్ష్మణా'' అని అరిస్తే సీత విని

లక్ష్మణుడితో "రాముడికేదో అపాయం జరగబోతోంది. వెంటనే వెళ్లు. అక్కడేం జరిగిందో చూడు" అంది. లక్ష్మణుడు "ఓ తల్లీ! అది మాయలేడి అరుపు. భయపడకు. రాముణ్నెవరూ దెబ్బతీయలేరు. అతను చాల శక్తివంతుడు. ఆ లేడిని చంపి ఉంటాడు. ఆ లేడి అరచిఉంటుంది. దానికి నీవు భయపడ వద్దు" అన్నాడు. కాని సీత అతను చెప్పగలిగిందంతా చెప్పినా అతని మాటలతో సంతృప్తి పడక "ఓరీ నీచుడా! రాముడు చస్తే నాతో ఆనందిద్దామనుకుంటున్నావా? నీవు, భరతుడూ నన్ను పొందవచ్చనే, ఉద్దేశ్యంతో భరతుడు నిన్ను పంపించాడా?" అంది. ఆ మాటలువిని లక్ష్మణుడు వేగంగా వెళ్లి పోయాడు.

సీతను గూర్చి మేమింతగా చర్చించటం ఆమెను అగౌరవపర్చాలని కాదు. పాఠకులు దీన్ని గుర్తించాలని గట్టిగా కోరుతున్నాము.

సీత యొక్క ఉనికిని గూర్చి ముఖ్యంగా రామాయణంలో రాసినట్లు మేము నమ్మటం లేదు. సీత ఉండేదని అనుకోవటం కూడా ఒక ఊహా చిత్రం మాత్రమే. ఆ ఊహ చిత్రం కూడా అవివేకం మీద ఆధారపడి వుంటుంది. దానికి తోడు రామాయణంలో సీతను మంచి శీలంగల స్త్రీగా గాని, వీరవనితగా గాని, తెలివగల స్త్రీగాగాని, కనీసం తన శీలాన్ని కాపాడు కోవాలని ఆదుర్ద గల స్త్రీగా గాని మలచటానికి రచయిత ఏ మాత్రం శ్రద్ద వహించలేదు. మరొక వైపు ఆమెను ఒక గుణహీనురాలుగా చిత్రీకరించాడు.

ఇదే కాక, రామాయణం ఒక కల్పిత కథే కాక భావకల్పనల మీద జరగటానికి వీలు కాని అసంబద్ధమైన పరిస్థితుల మీద ఆ కథనల్లారు.

రామాయణంలోనే సీతను ఒక సాధారణ స్త్రీగా మాత్రమే చిత్రీకరించారు. రామాయణం ప్రకారం ఆమె పుట్టినప్పటి నుండి, ఆ పిల్ల జనకుడికి అడవిలో దొరికనప్పటి నుండి, ఆమె ఆత్మహత్య చేసుకొని చనిపోయే వరకు, ఆమెలో సాధారణ మానవ గుణాల్నే మనం చూస్తాం కాని ఏ విధమైన దైవత్వాన్నో, మానవతీత శక్తినో ఆమెలో మనం చూడం. అంటే రామాయణంలో సీత ఒక సాధారణ స్త్రీ మాత్రమే. ఆమె మంటల్లో ప్రవేశించిందని, ఆమె మానవాతీతురాలుగా కన్పించవచ్చు. కాని వేశ్యలు కూడా పండగ రోజుల్లో దేవాలయాల్లో ఏర్పాటు చేసిన మంటల్లో అలా నడుస్తారు. వాళ్లే కాదు ఈనాడు కూడా పనికి రాని వెధవలు, తుంటరులు ఈ మంటల్లో నడుస్తుంటారు. వాల్మీకి రామాయణాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తే అప్పటికి సీత మూడు నెలల కడుపుతో గర్భవతిగా ఉందని మనం తెలుసుకుంటాం. సీత మూడు నెలల గర్భవతి ఎలా అయిందో ఇప్పుడు మేం వివరిస్తాం. సీత అగ్ని ప్రవేశం చేసే పరీక్ష పూర్తి కాగానే, రాముడు సీతను అయోధ్యకు తీసుకెళ్లి రాజ్యాన్నేలుతున్నాడు. రాజ్యం ఏలటం ప్రారంభించిన ఒక నెల రోజులు తర్వాత రాముడు సీత పూలతోటలో కూర్చుని ప్రేమికులుగా సరససల్లాపాలాడుతూ గడుపుతున్న సమయంలో రాముడు ఉబ్బుగా పెరిగిన సీత కడుపును చూచి వెంటనే ఆమె కడుపలా బయటకొచ్చిందెందుకని ఆమెనడిగాడు. దానికామె తాను నాలుగు లేక అయిదు నెలల గర్భవతినని చెప్పింది. అది విని వెంటనే రాముడు విచారంతో ఆదుర్దాగా అక్కడి నుండి వెళ్లిపోయి ఆమెను అడవికి పంపాలని ఆలోచించాడు. రాముడు రాచ భవనం ముందు విచారంగా కూర్చుని ఉండటం రాజవిదూషకుడు చూచి అతని వికల మనస్సును మరలించాలని ఎన్నో చమత్కారపు మాటల్ని చెప్పి చూశాడు. అయినప్పటికీ రాముడు అలాగే విచార పడుతుంటే అతని సోదరులు చూచి అతని విచారానికి కారణమేమిటని

అడగసాగారు. వాళ్లకు సమాధానంగా దేశ ప్రజలు సీతను గూర్చి ఏమనుకుంటున్నారని ప్రశ్నించాడు. సీతతో కలిసి జీవించటం రాముడి ఔన్నత్యాన్ని దిగజార్చేదిగా ఉందని అనుకుంటున్నారని వాళ్లు సమాధానం చెప్పారు. వెంటనే రాముడు లక్ష్మణుని పిలిపించి మరుసటి ఉదయాన్నే సీతను అడవికి తీసుకొని వెళ్లి అక్కడే ఆమెను వదిలేయమని బోధించాడు. దేశంలో బయలుదేరిన అపవాదును వదిలించుకోటానికి రాముడు సీతను అడవికి పంపాడని లక్ష్మణుడు విమర్శించినప్పుడు సీత సమాధానమిస్తూ, రాముణ్ని విమర్శించటం సరైంది కాదని, తాను అయిదు నెలల గర్భవతినని, అది తన కర్మ అని చెప్పింది. సీత తాను కడుపుతో ఉన్న పొట్టను లక్ష్మణుడికి చూయించింది.

అందుకని మండే నిప్పులపై నడిచిన ఆడవాళ్లందరూ పవిత్రులనో, దివ్యశక్తి కలవారనో మనం నిర్ణయించలేం. అలాగే సీత కూడా ఒక మామూలు మనిషే. అందుచేత సీతలాంటి ఒక మామూలు స్త్రీ నూరేళ్లు జీవించవచ్చు, లేక మరో పది లేక ఇరవై ఏళ్ళు ఎక్కువగాకూడా బతకవచ్చు. కాని రామాయణంలో చూస్తే సీత వెయ్యేళ్లు జీవించినట్లు చెప్పారు. కథను గురించి తర్వాత పరిశీలిద్దాం. రాముడు పదివేల సంవత్సరాలు జీవించాడన్నారు. కాని అటువంటి సీత ఏ విధంగా అంతకాలం రాముడితో కాపరం చేయగల్గింది. సీతకు అంత దీర్ఘకాలం జీవించేవరం ఎవరిచ్చారు? అంత కాలం ఎట్లా జీవించగలిగింది? ఈ ప్రశ్నలకు రామాయణంలో సరైన సమాధానాలు మనకు దొరకవు.

ఈ విషయాలు వదిలి మనమిప్పుడు రావణుడుకి సీతకు సంబంధించిన భాగంలోకి వెళ్దాం. అక్కడ సీతకు పతివ్రతకుండాల్సిన లక్షణాలేవి కనిపించవు.

వీరిద్దరికి సంబంధించిన విషయాన్నంతటిని పరిశీలించి దాంట్లో ఉన్న సత్యాన్ని శోధించమని ఒక సి.ఐ.డి ఆఫీసరకు అప్పగించి రావణుడు సీతను చెరిచాడనే అభియోగంపై రిపోర్టు ఇవ్వమని అడిగితే, ఆ రిపోర్టు మీద, రావణుణ్ని ముద్దాయిగాను, రాముడు నేరాన్ని దాకలు చేసిన వాడు గాను, వారి తరపున వాద ప్రతివాదాలను నిష్పక్షపాత వైకరితో న్యాయ విచారణ జరిపితే రావణుడి పక్షాన అతను అమాయకుడని, అతన్ని అనవసరంగా బ్లాక్‌మెయిల్ చేశారని న్యాయమూర్తి తీర్పు చేస్తాడని మనం ధ్రుఢంగా చెప్పవచ్చు.

ఇంకా చెప్పాలంటే అడవిలో సింహాన్ని వేటాడటానికి ఒక బోను పెట్టి, దాంట్లో బలిసిన ఒక లేడిని ఎరగా ఉంచితే, సింహం ఆ బోనులోకి వచ్చాక బోనును మూసేస్తే, సింహం దానంతట అదే బోనులోకి వచ్చిందని చెప్పవచ్చు. పైన చెప్పిన సి.ఐ.డి రిపోర్టు కూడా ఈ మోస్తరుగానే ఇస్తాడు.

## పురాణాల మీద నెహ్రూ గారి ధ్రుక్పథాలు

కొత్తఢిల్లీ, డిసెంబరు 14న వారు వెలిబుచ్చిన వ్యాక్యలు 15-12-54న "ది మెయిల్" పత్రికలో ప్రచురించారు. ఆ పత్రిక నుండి సేకరణ-

ప్రధాన మంత్రి తమిళనాడులో రామాయణంలో విపరీతమైన అసంబద్ధాల విషయాలు పరిశీలనకొచ్చాయి. దక్షిణ దేశంలో వస్తున్న ఈ ఉద్యమాలు ఉత్తరదేశ ప్రజలు తమను ఒక భాషా విషయంలోనే అణచి వేస్తున్నారని కాక అన్ని విషయాల్లోనూ తమను బాగా అణచివేస్తున్నారనే భయమైన భావంతో కూడుకున్నాయి. దక్షిణదేశీయులలో వస్తున్న ఈ

భావాన్ని సరిగా అర్థం చేసుకోవాలి. హిందీ భాషావాదాన్ని ప్రేరేపిస్తున్న నాయకులు ఈ విషయాన్ని పట్టించుకోపోతే వారు హిందీ భాషకు, మొత్తం దేశానికి ఏ న్యాయం చేయలేరు.

"మనం తప్పుడు ధోరణుల్ని పాటిస్తే" నెహ్రూ అంటాడు. "మనకు కష్టాలు పెరుగుతాయి. వాళ్ళు తలపోసే భావం చాల బలీయమైన మార్పుల్ని తెస్తుంది. ఆ భావంతో తమను అణచేస్తున్నారనే భయం పెరిగితే దాని వలన చాల తీవ్రమయిన పరిస్థితులు ఎదుర్కోవలసి ఉంటుంది."

శ్రీ నెహ్రూ తమిళనాడులో రామాయణంలో రాసిన విపరీత అసంబద్ధాలపై వస్తున్న చర్చలపై స్పందిస్తూ "కొత్తగా పెరుగుతున్న ఈ ఉద్దేశాలు వెనుక ఏముందో మనం కనుక్కోవాలి! ఉదాహరణకు రామాయణంలో రాసిన విపరీతమైన అసంబద్ధాల్ని గూర్చి శ్రోతలకు అర్ధమయ్యేదేమిటంటే, ఉత్తరాది వారు దక్షిణ దేశీవాసుల్ని ఈనాడు అణగదొక్కేయటం కాదు, ఈనాడే కాదు ఎన్నో వేల సంవత్సరాలుగా అణగదొక్కారు. మళ్లా యిప్పుడు ఒక అవకాశం దొరికితే మళ్ళీ అదే పని చేస్తారు" అని అంటారు.

## మహాభారత కథ

-ఒరిస్సాలో ఒక నాటకం చూసి నెహ్రూ శోకించాడు. నెహ్రూ ఇంకా చెప్పుతూ "రెండు రోజుల క్రితం నేను ఒరిస్సాలో ఉన్నాను. 'ఏకలవ్యుడి'పై ఒక హాస్య నాటికను చూశాను. ఇది మహాభారతంలోని ఒక కథ. ఒక పేద రైతు క్షత్రియులకు ధనుర్విద్య నేర్పుతున్న గొప్ప గురుపు ద్రోణుణ్ని తనకు కూడా బాణం అంబులు వాడే విద్యను నేర్చుకోటానికి సహాయం చేయమని కోరతాడు. అతను క్షత్రియుడు కాదు కాబట్టి ద్రోణుడు అతనికా విద్య చెప్పటానికి నిరాకరిస్తాడు. కాని రైతు కుమారుడు ద్రోణుడి విగ్రహమొకటి చేసి అది గురువుగా తనకు విద్య నేర్పుతున్నట్లు భావిస్తూ బాణం అంబుల్ని వాడే విధానాలు తిప్పలు పడి స్వయంగా నేర్చుకుని చివరకా విద్యలో గొప్ప ప్రావీణ్యుడయ్యాడు. ద్రోణుడు తన శిష్యుడు అర్జునుడి కన్నా ఏకలవ్యుడు ఎక్కువ ప్రావీణ్యుడయ్యాడని తెలిసి "గురుదక్షణ" లేక గురువు గారికివ్వవలసిన బహుమానం ఇవ్వమని అడిగాడు. తన బొమ్మ నుండి ఆ విద్య నేర్చుకున్నాడు కాబట్టి ఆ దక్షణ అడిగానంటాడు. ఆ దక్షణగా అతని కుడి బొటనవేలు ఇవ్వమని కోరాడు. అతనడిగినట్లుగానే దాన్ని ఏకలవ్యుడిచ్చాడు. తీవ్రంగా బాధ కలిగించే భారత కథలలో ఏకలవ్యుడి కథ ఒకటి.

"ఈ సంఘటనను గురించి నేను అంతగా ఆలోచించలేదు. కాని ఆ రోజు నుండి నన్ని విషయం చాలా బాధ పెట్టింది. ఒరిస్సాలో ఉన్న ఆదిమజాతులు తమని ఎలా అణచివేస్తున్నారో చూయించటానికి దీన్ని ఉదాహరణగా ఎత్తి చూయిస్తున్నారని నాకు వివరించారు. వాళ్ళు చూయించే అటువంటి స్పందనల్ని మనం గుర్తించాలి. సత్యమైన విషయమేమిటంటే ఇంత వరకు రాసిన చరిత్రంతా ఒక వర్గాన్ని సమర్థిస్తూ రాసిందే. ప్రజలు ఈనాడు అన్ని సంఘటనలపైన వారికనుగుణంగా రాసుకుంటున్నారు. వీటిని ఇతరులెలాగో కల్పించి సృష్టించినవని అనుకోగూడదు. ఈ కథను గూర్చి ఆలోచించినప్పుడు కొంత మంది ప్రజలు తమతో ఇతరులెవ్వరూ పోటీ పడకుండా ఎలా వ్యవహరించారో తెలిసి నాకు తీవ్రమైన కోపమొస్తుంది."

## చరిత్రకారుల ఉద్దేశాలు

విష్ణు దేవుణ్నిగా కొలిచే ఒక వీరుడు, క్షత్రియులకు మహాగురువు, ఆర్య జాతిని సరైన త్రోవలో నడిపించి వారికి విజయాన్ని కూర్చటానికి వారికవసరమైన ప్రతి తరుణంలో అవతారమెత్తుతుంటాడు.

హావెల్ రాసిన 'ఇండియాలో ఆర్యుల పాలన' అనే గ్రంథం నుండి (పేజి 32)

తెల్లరంగు శరీరమున్న ఆర్యులు ఉత్తర-పడమట మూల నుండి హిందూకుష్ పర్వతాల మధ్యగా నడిచి ఆఫ్గనిస్తాన్ దాటి ఇండియాలో ప్రవేశించే నాటికి ద్రావిడులు ఇండియా ఉత్తర దక్షిణ చాల ప్రాంతాల్లో స్థిరనివాసమేర్పరచుకొని ఉన్నారు. ద్రావిడులు సహజంగానే కొత్తగా వచ్చిన వాళ్లను రాకుండా వాళ్ల శక్తి సామర్థ్యాలన్నిటినీ ఉపయోగించి ఎదుర్కొన్నారు. ఈ పోరాటం చాల కాలం పొడువునా సాగుతూ వచ్చింది. ఇది రెండు జాతుల మధ్య జరిగిన ఉత్త పోరాటం మాత్రమే కాదు రెండు రకాల నాగరికతల మధ్య జరిగిన యుద్ధం.

ద్రావిడులు వాళ్ళు జీవించే ఉనికి కోసం పోరాడవలసి వచ్చింది. ఈ పోరాటం యొక్క తీవ్రతను గూర్చి చాల పాఠాలు రుగ్వేదంలో కనిపిస్తాయి.

రమేష్‌చంద్ర ముజుందార్, యం.ఏ., పి.హెచ్.డి., రాసిన 'సంక్షిప్త పురాతన ఇండియా చరిత్ర, నాగరికత' అనే గ్రంథం నుండి (పేజి 21, 22)

భారత ఆర్యుల కాలంలో వారు జరిపిన దండయాత్రలు, వారిలో వారికి జరిగిన యుద్ధాల్ని గూర్చి రామాయణం, భారతం వివరిస్తాయి.

ఇవి నిజంగా జరిగాయని నేనెప్పుడూ వాటికి ప్రాధాన్యత ఇవ్వలేదు. వాటిలో ఉన్న మంత్రాలు, మహిమల్ని గూర్చి విమర్శించాను కూడా. ఊహించి కల్పించి రాసిన అరేబియన్ రాత్రులు లేక పంచతంత్రలాంటి కథలవి.

జవహర్‌లాల్ నెహ్రూ -తన "డిస్‌కవరీ ఆఫ్ ఇండియా" పుస్తకం నుండి (పేజీ 75, 76)

ఇండియాలోకి జొరబడిన ఆర్యులు జాతిపరంగాను, రాజకీయపరంగాను సమస్యల్ని లేవనెత్తారు. ఓడిపోయిన ద్రావిడ జాతికెంతో దీర్ఘమైన నాగరికత దాని వెనక ఉంది. కాని వాళ్లకన్న ఆర్యులు గొప్ప వాళ్ళమని, వాళ్ళకు వాళ్లే నిర్ణయించుకున్నారని ఏ మాత్రం అనుమానం లేకుండా చెప్పవచ్చు. వీళ్లిద్దరి మధ్య ఒక పెద్ద అగాధమైన వైరుధ్యముంది.

జవహర్‌లాల్ నెహ్రూ-తన 'డిస్‌కవరీ ఆఫ్ ఇండియా' అనే గ్రంథం నుండి (పేజి 62)

దక్షిణ దేశంలోకి ఆర్యులు విస్తరించటాన్ని గూర్చి చెప్పే కథ రామాయణం

'డిస్‌కవరీ ఆఫ్ ఇండియా' (పేజి82)

విరుద్ధమైనదేమిటంటే, ఆర్యులు వాళ్ల జాతికి తెలియనటువంటి ఇతర జాతుల భాషల్ని నేర్చుకోవాల్సి రావటమే గాక వాళ్ల నాగరికతలో కనీసం కొంత భాగాన్నయినా గుర్తించి అనుసరించాల్సిన అవసరం వారికేర్పడింది.

సర్ ఆర్.జి.భండార్కర్ కలెక్టెడ్ వర్క్స్ నుండి (వాల్యూం III, పేజీ 10)

ఇంద్రుడు మొదలైన దేవుళ్లను పూజించే వాళ్లు, వాళ్లను అనుసరించే వాళ్లను దేవతలని ఇంద్రుడి పూజల్ని అతనికిచ్చే బలుల్నివ్యతిరేకించే విరోధి వర్గాన్ని అసురులు అన్నారు. ఈ పదాలు ఒకరినొకరు తిరస్కరించుకోటానికి తయారైనాయి.

ఎ.సి.దాస్, యం.ఏ. బి.యల్. 'రిగ్వేద ఇండియా' అనే పుస్తకం నుండి (పేజి 151)

రామాయణం, మత్తు పానీయాలకు అలవాటు పడిన సురులు, ఆ మత్తుకు దూరంగా ఉండే అసరులు వీరిద్దరిని వేరు వేరుగా చీల్చి చూస్తుంది.

'ది హిస్టోరియన్ హిస్టరీ ఆఫ్ ది వరల్డ్' (వాల్యూం II, పేజీ 521)

పెరియార్ (1879-1973) అని ప్రేమగా దక్షిణాది ప్రజలు ఈ నాటికీ సంస్మరించే ఇ.వి.రామసామి జీవితం గతించిన తరానికే కాదు వర్తమాన, భావి తరాలకూ స్ఫూర్తిదాయని. చరిత్రలో చాలా మంది మత సంస్కర్తలు సంఘ సంస్కర్తలున్నారు. కాని కుల రక్కసి కంచుకోటను బద్దలు చేస్తూ, మత మౌఢ్యాన్ని ముక్కలు చేస్తూ ఉద్యమించిన పెరియార్ వారందరికన్నా భిన్నమైన విశిష్టమైన పాత్రను నిర్వహించారు. ఆత్మగౌరవం అనే విలువను ప్రతిపాదిస్తూ అదే పునాదిగా సమాజాన్ని పునర్నిర్మించేందుకు ఆయన అవిశ్రాంతంగా కృషి చేశారు. అందులో భాగంగానే తన అద్భుత విమర్శనా నైపుణ్యంతో, వాక్పటిమతో అశేష ప్రజానీకాన్ని ఆరు దశాబ్దాలకు పైగా చైతన్య పరుస్తూ వచ్చారు. పెరియార్ పేరు వినగానే చాలా మందికి గుర్తొచ్చేది నాస్తిక వాదం. అయితే ఆయన దేవుడిని నమ్మని వ్యక్తి అన్నది వాస్తవమే. అయితే ఆయన గొప్ప మానవతా వాది కావడం వల్ల దైవభక్తులయిన వ్యక్తుల పట్ల తగిన గౌరవాన్ని చూపేవారు. పెరియార్ తన ఆస్తినీ, సౌఖ్యాల్నీ తను నమ్ముకున్న ఉద్యమాల కోసం వదులుకుని అతిసామాన్యమైన జీవితాన్ని ఎన్నుకున్నారు.

"తన ప్రజలకు సామాజిక న్యాయం నిరాకరించే సమాజం ఆర్థిక, రాజకీయ సమానత్వం కోసం పోరాడే శక్తిగల నాయకులను సృష్టించలేదు. రాజకీయ ఆత్మగౌరవం, సాంఘిక ఆత్మగౌరవం చెట్టపట్టాలు పట్టుకొని సాగుతాయని నేను పునరుద్ఘాటిస్తాను-ఆ రెండూ ఒకటి లేకుండా మరొకటి అభివృద్ధి చెందజాలవు. మనం సాంఘిక ఆత్మగౌరవం సాధించినట్లయితే రాజకీయ ఆత్మగౌరవం దానితోపాటే ఒనగూడుతుంది" అని పెరియార్ విశ్వసించారు.